# ఉత్తర భారత యాత్రలు

| | Route | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 1,300 |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 400 |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 350 |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 2,200 |

**Fare includes Dormitary accommodation and transport/Guide charges.** Tariff for Tour No.4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్" లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని అమరావతి/సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిశెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

**Southern Travels/Hotel Southern**

**ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య స**

**Samaj Road, WEA Karol**

**ew Delhi - 110 005.**

**(Phones : 5722210 (6 Lines); 5739508)**

**Our branches**

1 Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones 223658, 227233)

2 Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones 2267040, 2262633)

3 Hotel Howrah Complex, Opp Madras Central Railway Station, Madras - 600 003 (Phones . 564864, 585253)

4 No.10, Swarnalok Complex, Opp. Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones 62227)

5 Pavan Palace, Ground Floor, Opp T S R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016 (Phone : 545565)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2–2–21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6–3–609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19–5–1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/–లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/–లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

| | |
|---|---|
| నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి | మేడా నరసింహులు శ్రేష్ఠి |
| అధ్యక్షులు | ప్రధాన కార్యదర్శి |

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు

# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్



MR
BRAND

DOUBLE REFINED SUNFLOWER OIL



" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జీ.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి - అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.
✆ :31, 64, 74.

✆ : Offi : 231, 264, 398, 399. Resi : 274.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం    స్థాపితం : 1961    బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 2262 ప్రకాశం జిల్లా.    ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్ లింగములలో రెండవది అయిన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన పవర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణా నదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినమునను, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భమునను వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

యిట్లు

పాలకవర్గం

అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969



సంపుటి
26



సంచిక
5



జనవరి–1995



సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి



ప్రాప్తిస్థానం
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్ "
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప – 516 002.


సంపాదకీయం.

# ప్రకటనలు తెచ్చిన ప్రమాదం (తిరుపతి సీతమ్మ వ్యవహారం)

మితిమీరిన పత్రికా ప్రకటనలు ఎంత ప్రమాదకర మైనవో బేరీజు వేసుకొనేందుకు తిరుపతిలోని శ్రీమతి పంగులూరు సీతమ్మ ఆస్తుల వ్యవహారం ఒక మంచి ఆధారము.

ఈ విషయములో గత రెండు సంవత్సరాలుగా సాగిన పత్రికా ప్రకటనలు మౌలిక సమస్యను తీర్చకపోగా, సరిక్రొత్త సమస్యను తెచ్చిపెట్టి విషయాన్ని మరింత జటిలం చేశాయి.

ఇంత వరకూ వైశ్యుల చేతులలో ఉన్న వ్యవహారం ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖ వారి చేతుల్లోకి వెళ్ళింది.

ఇంతవరకూ ప్రభుత్వ దేవాదాయ, ధర్మాదాయశాఖ వారికి ఈ ఆస్తులపై అధికారము లేదు అని కాదు. కానీ, ఉన్న ఆ అధికారము కేవలము నామమాత్రమైందే.

స్వర్గీయ సీతమ్మ గారి వీలునామా ప్రకారము ఆయమ తాను ధర్మంగా ఇచ్చిన ఆస్తులన్నింటిపైనా తిరుపతి పట్టణములోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయ నిర్వహణా సంఘం వారికి నిర్వహణాధికారం ఉంది. అందువల్ల ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖ వారికి నేరుగా సీతమ్మ ఆస్తుల పై అధికారం కాక, తిరుపతి పట్టణములోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయానికి ధర్మకర్తృత్వ మండలిని నియమించుట ద్వారా మాత్రమే లభించే అధికారము మాత్రమే ఉండేది. ఇప్పుడు అమలులో ఉన్న భారత రాజ్యాంగములోని 26 (సి) సూత్రము ప్రకారము ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖ వారికి గల ఆ అధికారము నామమాత్రమైందే. న్యాయస్థానాలలో సూలు చేయుట ద్వారా సులభంగా తప్పించుటకు వీలున్నది కూడ.

అయితే, ఇప్పుడు ఈ అధికారము నేరుగా ప్రభుత్వాధికారులకు ఎలా వచ్చింది? అను ప్రశ్న కలుగవచ్చు. భారత రాజ్యాంగములోని 26 (సి) సూత్రము క్రింద, 'డినామినేషన్ టెంపుల్స్' 'డినామినేషన్ ఇనిస్టిట్యూషన్స్'గా శ్రీ వాసవీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల స్వతంత్ర ప్రతిపత్తిని సంరక్షించుకొనే అవకాశం ఉన్నా - ఒక ధర్మసంస్థ యొక్క ఆస్తులు దుర్వినియోగమైనట్లుగా కానీ, దుర్వినియోగం అగుచున్నట్లుగా కానీ ప్రభుత్వాధికారులు భావించుటకు ఆస్కారం ఏర్పడినపుడు, అట్టి 'దుర్వినియోగ నివారణ' అను నెపముతో నేరుగా అధికారమును పొందుటకు శాసనపరమైన ఆధారం కలుగుతుంది. అదే ఈ స్వర్గీయ సీతమ్మ ఆస్తుల వ్యవహారములో జరిగింది కూడ.

సీతమ్మ గారి ఆస్తులు దుర్వినియోగం జరిగనవి, ఇంకా జరుగుచున్నవి అనేందుకు వైశ్య సోదరులు ఒకరి కొకరు పోటీపడి ఇచ్చిన పత్రికా ప్రకటనలకు మించిన ఆధారాలు ప్రభుత్వాధికారులకు ఏమి కావాలి?

కొన్ని పత్రికలలో - ముఖ్యంగా గుంటూరు పట్టణం నుండి వెలువడే తెలుగుసీమ పత్రికలో - వైశ్య సోదరులు ఒకరికొకరు పోటీపడి ఇచ్చిన ప్రకటనలే ప్రభుత్వాధికారులకు సదరు ఆస్తులపై నేరుగా అధికారాలు పొందుటకు అనువైన ప్రాతిపదికలు.

పత్రికా ప్రకటనలను ఇచ్చుటలోని ఓర్పునూ, నేర్పునూ తాము ఇలా ఇచ్చే ప్రకటనలు ఈ సమస్యను పరిష్కరించుటలో ఎంత వరకూ తోడ్పడతాయి? అని ఆలోచించుటలో చూపలేకపోయారు.

ఇటువంటి విషయాలు చాలా సున్నితమైనవి. ఎంత సంయమనముతో పరిష్కరించుకోవాల్సినవే కానీ పత్రికా ప్రకటనల ద్వారా మాత్రమే పరిష్కారమయ్యేటివి కాకపోగా మరింత జటిలమయ్యేవి. అందుకనే వైశ్యప్రబోధిని ఈ విషయములో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించింది. స్వర్గీయ పంగులూరు సీతమ్మ ఆస్తుల వ్యవహారములో ఎంత అవసరమో, అంతే విషయాన్ని ప్రచురించింది.

గత రెండు సంవత్సరాలుగా జరుగుచున్న ఈ పోటా పోటీ ప్రకటనలు సాధించిందేమిటి? అని ప్రశ్నించుకోవలసిన సమయం ఇది. ఒక్క అడుగు కూడ ముందుకు పోలేదు అన్నది పచ్చి నిజం..

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ ఉపాధ్యక్షులు, గుంటూరు వాస్తవ్యులు శ్రీ పడుచూరు వెంకటేశ్వర్లు గారు తమ అనుచరవర్గముతో తిరుపతికి వచ్చి, ఈ ఆస్తుల వ్యవహారాన్ని కూలంకషంగా పరిశీలించి, అందుకు తగిన పరిష్కారాన్ని ఆలోచించాల్సిన బాధ్యతను విస్మరించి, "నేను మాత్రమూ పత్రికా ప్రకటనలు ఇవ్వడములో వెనుక బడుతానా?"-అన్నట్లుగా ఒక సుదీర్ఘ ప్రకటనను తెలుగు సీమలో ఇచ్చారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో వైశ్యులకు సంబంధించి, "ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ"కు మించిన పెద్ద సంస్థ, బాధ్యత కలిగిన సంస్థ ఏదైనా ఉన్నదా? ఆర్థిక స్తోమత, సిబ్బంది సౌలభ్యత హెచ్చుగా గల సంస్థ కదా అది? అట్టి అతి పెద్ద రాష్ట్ర సంస్థకు ఉపాధ్యక్షులుగా ఉన్న శ్రీ వెంకటేశ్వర్లు గారికి ఈ విషయాన్ని పరిష్కరించుటలో బాధ్యత లేదా? అధికారం లేదా? అన్న ప్రశ్న విజ్ఞతతో ఆలోచించగలిగే వారికి ఎవరికైనా కలుగుతుంది.

పోటా పోటీగా పత్రికా ప్రకటనలు ఇచ్చి ముచ్చట తీర్చుకున్న వారెవరూ కూడ స్వయంగా ముందుకు వచ్చి, ప్రత్యక్షంగా ఏ కార్యక్రమాన్ని రూపొందించలేక పోయారు. అందువల్ల తమ కర్తవ్యము, బాధ్యత పత్రికా ప్రకటనలు ఇచ్చుటతోనే సరిపుచ్చుకొని తృప్తి పడ్డారంటే ఆగ్రహం పడవలసిన అవసరం లేదు.

ఈ ఒక్క విషయములోనే కాదు. అనేక విషయాల్లో ఈ మధ్య రాష్ట్రంలోని కొందరు వైశ్య సోదరుల స్పందన ఇలాగే ఉంటూ ఉంది. పత్రికా ప్రకటనలతోనే సరిపుచ్చుకోవటం వరకే ఉంది కానీ కార్యరూపములో "హుళక్కి". కార్యము లేకుండా, ప్రయత్న లోపముతో కూడి, సహకార గుణం ఏ మాత్రమూ లేని కేవల పత్రికా ప్రకటనలు ఇచ్చుట అను స్పందన మాత్రమే కలిగిన వారివల్ల వచ్చేది ఫలోన్ముఖం కాదు. రాను, రాను వైశ్యసోదరులలో ఇటువంటి వారి సంఖ్య దినదిన ప్రవర్ధమాన మగుచుండుట ఆవేదనా జనితము.

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు గల ఆర్థిక స్థోమత, సిబ్బందీ లేకపోయినా, ఒక రకంగా రాష్ట్రస్థాయి ప్రతిపత్తిగల సంస్థ శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్. అయినా, తన కర్తవ్యాన్ని గుర్తించిన ఆ సంస్థ ఈ విషయమై వచ్చిన వ్యక్తులకు రెండు, మూడు దఫాలు సముచితమైన సూచనలు ఇచ్చి, వాటిని అమలులో పెట్టమని చెప్పింది. అయితే వాటిని ఆచరణలో పెట్టక, మరొక విధంగా ఈ సమస్యను నడిపించారు. విషయం పూర్తిగా తెలియని వారెవరైనా ఆ సమాఖ్యపై ఆరోపణలు చేస్తే అవి వారికి వివేక విహీనతకు గుర్తులుగా మాత్రమే ఉంటాయి.

అయిందేదో? అయింది. ఇకనుంచైనా పత్రికా ప్రకటనలకు మాత్రమే పరిమితం కాకుండా కార్యరూపములో సమస్యను పరిష్కరించాలని చేసే ప్రయత్నమే విజ్ఞతలో కూడిన దౌతుంది.

ఈ సమస్య పత్రికా ప్రకటనలతో పరిష్కారమయ్యేది కాదు. ఆర్థిక, శారీరక సహాయాల ద్వారా మాత్రమే పరిష్కారమౌతుంది.

"వట్టి మాటలు కట్టి పెట్టోయ్" అను సూక్తిని పోటీపడి ప్రకటనలు ఇచ్చే వైశ్య సోదరులు ఇకనైనా గుర్తిస్తారని ఆశిద్దాం.

వైశ్యబోధిని, జనవరి, 1995

## ఆత్మార్పణ దినం

గుర్తుంచుకోండి

శాంతి, ప్రశాంతి, అహింసలతో సర్వ ప్రపంచమూ నవనవోన్మేషంగా ఉండాలన్న మహోన్నత ఆశయ సాధనకై శ్రీ వాసవీదేవి ఆత్మార్పణ చేసిన అత్యంత పవిత్ర దినము మాఘశుద్ధ విదియ. ఆ తిథి ఈ సంవత్సరము (1995) ఫిబ్రవరి 1వ తేదీన బుధవారం అవుతుంది. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాల పరిపాలకులు ఈ వర్ధంత్యుత్సవాన్ని ఘనంగా జరిపించాలి. వర్ధంతికి సంబంధించిన సర్వ విషయాలనూ శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ వారి కార్యక్రమాల పత్రిక 'వాసవి' అక్టోబర్ - డిసెంబర్ 1994 సంచికలో వివరంగా ప్రచురించింది. శ్రద్ధతో ఆ 'వాసవి'ని చదవండి.

ప్రతి వైశ్యుడూ 1.2.1995వ తేదీ బుధవారం తెల్లవారు ఝాముననే తమ యింటి ముంగలిని శుభ్రపరచి, రంగ వల్లులతో రంగ, రంగ వైభవంగా అలంక రించాలి. గృహ ప్రధాన ద్వారానికి మామిడి తోరణమును కట్టాలి. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవిని ఉద్దేశించి ఆయమ్మ సహస్ర నామావళితో "సర్వ ప్రజా సంక్షేమ సిద్ధ్యర్థం శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ పూజాం కరిష్యే" అను సంకల్పముతో, ఆవాహనమూ మొదలగు షోడశ పూజలు చేసి, నైవేద్యాన్ని సమర్పించాలి.

## వైశ్యులు-పరుసవేది విద్య

కొండవీటి (గుంటూరు జిల్లా) కైఫీయతులో వైశ్యులకు యినుము బంగారము చేయు పరుసవేది విద్య తెలియునని వ్రాయబడి వున్నది.

పెద కోమటి వేమారెడ్డి పేరు యిందుకు నిదర్శనము.

(ఆంధ్రదేశములో సంఘ సంస్కారణోద్యమాలు అను గ్రంథము ఆధారముతో)

సేకరణ : చుండూరి అప్పారావు

రావెల.

గుంటూరు జిల్లా.

## వివాహం

అనంతపురం జిల్లా కల్యాణ దుర్గం వైశ్య ప్రముఖులు శ్రీ రాచమడుగు రాధాకృష్ణగారి ఏకైకపుత్రుడు చి॥ నాగరాజు డి.ఫార్మా, గారి వివాహం కదిరి వైశ్య ప్రముఖులు శ్రీ దండి రామనాథం గారి కుమార్తె చి॥ సంధ్య తో 23.12.1994వ తేదీన కదిరిలోని ఆర్యవైశ్య వసతి మందిరములో వైభవంగా జరిగింది.

*గమనిక :-* ఈ శీర్షికన ప్రకటన కావాలను కొనేవారు *రు.116/-లు* మనియార్డరు ద్వారా పంపుచూ ఆహ్వాన పత్రికను కూడా పంపాలి.

# లలిత – చండిక – కన్యక

శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి,
సంపాదకులు

"బ్రహ్మ", "మాయ" – ఈ రెండే ప్రపంచమంతటా మూల భూతమైన పదార్థాలు. ఈ రెండూ కాక మిగిలినదంతా మిగిలిన వన్నీ పై రెండింటి యొక్క వికారాలే. అయితే "బ్రహ్మ" అంటే ఏమి?

ఈ సర్వ సృష్టికీ, స్థితికీ ఆధార భూతమైన ఒక మహత్తర 'వస్తువు' లేక 'శక్తి' ఉంది. ఆ వస్తువే బ్రహ్మ. ఆశక్తే బ్రహ్మ. వేదాలు చెప్పే మాటలు ఇవే. ఉపనిషత్తులు ఈ 'బ్రహ్మ'ను సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మ అని నిర్వచించాయి. అయితే, వాస్తవానికి సత్తు, చిత్తు, ఆనందములే బ్రహ్మ యొక్క స్వరూపం.

రెండవదైన 'మాయ' కూడ ఈ సచ్చిదానము నుండీ (సత్, చిత్, ఆనందం) పుట్టిందే. 'బ్రహ్మ','మాయ' – అని పైకి వేరు వేరుగా కన్పిస్తున్నప్పటికీ అవి అభిన్నములు. ఉదాహరణలుగా చెప్పాలంటే చంద్రుడు – వెన్నెల, అగ్ని – కాల్చు శక్తి. ఈ రెండిటినీ ఏ విధంగా వేరు చేయడానికి సాధ్యము కాదో, ఆ విధంగానే బ్రహ్మ నుండీ మాయను వేరు చేయుటకు కూడ సాధ్యము కాదు.

'బ్రహ్మ', 'మాయ' – అను ఈ రెండింటిలో బ్రహ్మ సత్యమైంది. అవ్యక్తము. అంటే తెలుసు కోవడానికి వీలు కానిది. స్త్రీ, పుం, నపుంసక లింగములకు అతీతమైంది. అందుకే 'నస్త్రీ నషండో, నపుమాన్, నజంతుః – అని ఈ బ్రహ్మను వేదాలు వర్ణించాయి. అయితే ఇదే బ్రహ్మను 'రసోవైసః బ్రహ్మ'అని పుంలింగములోనూ 'తత్త్వమసి' అని నపుంసక లింగములోనూ, దేవీ "అక్షరంబ్రహ్మ సమ్మితమ్" అని స్త్రీ లింగములోనూ ఆ వేదాలే వర్ణించాయి. కాబట్టే కొందరు తత్వాన్ని పురుషుడుగా, మరి కొందరు స్త్రీగా, మరి కొందరు సచ్చిదానందంగా భావించి, ఉపాసిస్తు న్నారు. బ్రహ్మతత్వాన్ని పుంలింగముగా భావించినవారూ, అనుభూతిని పొందిన వారూ చెప్పిందే పురుషసూక్తము. శ్రీ సూక్తము స్త్రీగా భావించిన వారూ, అట్టి అనుభూతిని పొందిన వారూ చెప్పింది.

మూల తత్వాన్ని 'స్త్రీ' మూర్తి అనే భావనతో చేసే ఉపాసనను శ్రీ విద్య అంటారు. దత్తాత్రేయులు ఈ శ్రీ విద్యా ప్రదాతలు 'త్రిపురా రహస్యము' – శ్రీ విద్యను గురించి ఇలా చెప్తూ ఉంది – దత్తాత్రేయులవారు ఈ శ్రీ విద్యను పరశు రామునికి బోధించాడు. ఈ పరశురాముడు కర్దలి అనే అరణ్యములో ఉండే హరితాయనుడు అను మహర్షికి బోధించాడు. సుమేధ అని కూడ ఈ హరితాయనుడు పిలువబడుతాడు.

శ్రీ విద్య లలితా పరమనీ, చండీ పరమనీ రెండు రకాలు. 'బ్రహ్మాండ పురాణము', 'దేవీ భాగవతమూ' – ఈ లలితామహిమను ప్రతిపాదించాయి. మార్కండేయ పురాణము చండీ మహిమను ప్రతిపాదించింది.

ఈ రెండు తత్వాలలోనూ శబ్దములో

తేడానే కానీ వస్తువులో బేధం లేదు. 'లలిత' పంచదశాక్షర ఘటితము అంటే 15 అక్షరాలు కల మంత్రము. 'కయే ఇలహ్రీం, హసకహహ్రీం సలకలహ్రీం' - అను ఇదే లలితా దేవి యొక్క మూలమంత్రము. ఇక, చండీ మంత్రము నవాక్షర ఘటితము. అంటే ఐం, హ్రీం, క్లీం, చాముండాయై విచ్చే(స్వాహా) అను ఈ తొమ్మిది అక్షరాలతో కూడిన మూల మంత్రము.

'లలిత' అన్నా, 'చండిక' అన్నా, 'కన్యక' అన్నా ఈ మూడూ ఆదిశక్తి స్వరూపాలే. శాంతముతోనూ సౌమ్యము గానూ ఉన్న ఆదిశక్తిని 'లలిత' అంటారు. రౌద్రంగానూ, భీకరంగానూ ఉన్న ఆదిశక్తిని 'చండిక' అంటారు.

"దుర్గే స్మృతాహరసి భీతి మశేషజంతో
స్వస్తే స్మృతా మతి మతీవ శుభాం దధాసి
దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా
సర్వోపకార కరణాయ సదార్ద్రచిత్తా"

- అని లలితా దేవిని దేవతలు ప్రస్తుతించారు.

అయితే ఈ ఆదిశక్తిని భాగవతమూ యోగమాయ అని వర్ణిస్తూ ఆ యోగ మాయకు, అనగా ఆదిశక్తికీ, దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చంద్రిక, కృష్ణ, మాధవి, కన్య, మాయ, నారాయణి, ఈశాని, శారద, అంబిక అను పద్నాలుగు (14) రూపములున్నట్లుగా పలుకుచూ ఉంది.

పై పద్నాలుగు రూపాలలో నవమ (తొమ్మిదవ) రూపమైన కన్యకా స్వరూపమునే వైశ్యులు అనాది నుండీ తమ కుల దేవతగా ఆరాధిస్తున్నారు. మాతృస్వామ్యవ్యవస్థ - ప్రపంచములో మొట్టమొదటిది అని తెలుసుకొన్నవారు ఈ విషయాన్ని కాదనలేరు.

ఆదిశక్తి యొక్క ప్రశాంత తత్వయుక్తమూ, న్యాయ, ధర్మముల సంయుక్తస్వరూపమే కన్యక. ఆమే కన్యకా పరమేశ్వరీ దేవి. అంధకార బంధురమైన ప్రపంచములో అహింసా జ్యోతిని వెలిగించుటకై కుసుమార్య, కుసుమగుప్త దంపతులు కలియుగమున గోదావరీ తీరములో 'వాసవి'గా జన్మించి ఆత్మార్పణ చేసిన అనంతరము శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవిగా పూజింపబడుచూ ఉంది.

"ఓం, ఐం, హ్రీ, క్లీం, శ్రీం, హ్లాం, వం, శ్రీ వాసవీ కన్యకే మహ్యం సర్వసౌభాగ్యం దేహి, దేహి స్వాహా" - అను ఈ షడ్వింశదక్షర ఘటితమైనది శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వర దేవి మూల మంత్రము. షడ్వింశదక్షరములనగా, ఇరవై ఆరు అక్షరములతో కూడిన యీ మూల మంత్రములో బీజాక్షరాలు 'ఏడు' కాగా, మంత్రాక్షరాలు పందొమ్మిది. ఈపై విధంగా షడ్వింశదక్షర ప్రోక్తమైన ఈ మంత్రము దారిద్ర్య ధ్వంసిని.

ఓం కారిణీంచ, వరదాభయ హస్తముద్రాం
ఐం, సౌః కలాం! తరుణ మంధర
దృగ్విలాసాం
తాం, వాసవీం సుర కిరీట మణీమరీచి
సంప్లావితాం! త్రిజగతాం జననీ ప్రపద్యే

అని దేవతలు శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరిని స్తుతించారు.

---

1-2-1995 బుధవారం శ్రీ వాసవీ ఆత్మార్పణ దినోత్సవం. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రచురితమైన వ్యాసము.

# శ్రీ మేడా నరసింహులు గారికి
# మరో అవార్డు "జెమ్ ఆఫ్ ఇండియా"

హైద్రాబాద్ పుర ప్రముఖులూ, పేరున్న మంచి కాంట్రాక్టర్లూ, నిర్మాణ రత్న బిరుద విరాజితులూ, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య అధ్యక్షులూ శ్రీ మేడా నరసింహులు గారికి "జెమ్ ఆఫ్ ఇండియా (GEM OF INDIA)" అవార్డు లభించింది. నిర్మాణ రంగములో వీరు చేసిన కృషికి ఫలితంగా లభించిన ఈ ప్రతిష్ఠాత్మకమైన "జెమ్ ఆఫ్ ఇండియా" అవార్డును 'ఆల్ ఇండియా ఎచీవర్స్ కాన్ఫరెన్సు' వారు 17.12.1994వ తేదీన న్యూఢిల్లీలో "ఇండివిడ్యువల్ ఎచీవ్‌మెంట్స్ అండ్ నేషనల్ బిల్డింగు పైన నిర్వహించిన 13వ నేషనల్ సెమినార్‌లో శ్రీ నరసింహులు గారు ఈ అవార్డు ప్రధానోత్సవ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన భారత ప్రభుత్వ




దేశీయాంగ శాఖా సహాయమంత్రి శ్రీ పి.యం.సయీద్ గారి నుండి స్వీకరించారు. న్యూఢిల్లీలోని "హొటల్ తాజ్ ప్యాలెస్"లో 17.12.94వ తేదీ శని వారం సాయంత్రం 4 గంటలకు ఈ ప్రధానోత్సవ సభ జరిగింది.

శ్రీ నరసింహులు గారికి ఇటువంటి జాతీయస్థాయి గౌరవం లభించడం 1994లో ఇది మూడవ సారి. 24.1.1994వ తేదీన న్యూఢిల్లీలో జరిగిన నేషనల్ కాన్ఫరెన్సు ఆన్ ఎకనమిక్ డెవలప్‌మెంట్‌లో "1994 నేషనల్ యూనిటీ అవార్డునూ, ఆల్ ఇండియా ఎచీవర్స్ వారు 27.7.1994వ తేదీన బెంగుళూరు లోని "హొటల్

అశోకేలో 'వ్యక్తిగత సమున్నతి, జాతి నిర్మాణము'–అను అంశముపై నిర్వహించిన పద కొండవ సెమినార్‌లో ఆల్ ఇండియా ఎచీవర్స్ వారి నుండీ ప్రతిష్ఠాత్మకమైన హిందూ గౌరవ్ అవార్డునూ అందు కొన్నారు. 20.2.1994న హైదరాబాద్ కాచిగూడ వైశ్య హాస్టల్లో జరిగిన రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య దశాబ్ది ఉత్సవాలలో ఆ సంస్థ ఇచ్చిన "నిర్మాణరత్న" అను అవార్డును అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వైద్య, ఆరోగ్య, శాసనసభా వ్యవహారాల మంత్రి శ్రీ కె.రోశయ్య గారి నుండీ తీసుకున్నారు.

## సహకరించండి

## ఇది మీ కర్తవ్యము

సాహిత్య ప్రపంచములో వైశ్యజాతి స్థానాన్ని శిఖరాగ్రాన నిలిపి, శాశ్వతత్వం చేసిన మహా కవులు, మహా పండితులు, అవధాని శేఖరులు స్వర్గీయ దోమా వెంకటస్వామి గుప్తగారు. వీరు శ్రమించి వ్రాసిన గ్రంథాలు, బృహత్ గ్రంథాలు అనేకం ఇంకా అముద్రితంగానే ఉన్నాయి. వీటిని ముద్రించి, ప్రపంచాని కందించాలన్న పవిత్రమైన, గొప్ప ఆశయముతో కడపలో ఏర్పాటైన శ్రీ దోమా వెంకట స్వామి గుప్త సాహిత్య పీఠము వారు వాటిని ముద్రించు ప్రయత్నాన్ని చేపట్టారు. గుప్తగారి రచనల్లో ఒక్కటే, ఒక దఫా ముద్రితమూ అయిన 'శ్రీ కన్యకా పురాణము'ను ప్రప్రథమంగా ముద్రించుటకు ప్రారంభించారు. ఉదారమైన హృదయంతో ఆర్థికంగా సహకరించి గుప్త గారి రచనలు వెలుగును చూచుటలో సహకరించవలసినదిగా కోరుచున్నారు. రూ.116/–లు పంపిన వారికి ఒక ప్రతిని పంపుతారు. అట్టివారు పీఠములో జీవిత సభ్యత్వము కలవారుగా కూడ ఉంటారు. గుప్త గారు వైశ్య వంశ సముద్భవులు. సరస్వతీ పుత్రులు. అందువలన యీ సహకరించవలసిన భాద్యతా, విద్యుక్తమూ ప్రతి వైశ్య సోదరునిపై ఉంది. సంపదలచు కొన్ని రూపాయలను, శ్రీ దోమా వెంకట స్వామి గుప్త సాహిత్య పీఠము, వైశ్య ప్రబోధినీ కార్యాలయం, జయనగర్ కాలని, కడప – 516 002కు పంపాలి.

మరచి పోరాదు. గుప్త గారి గ్రంథాలు వెలుగు చూచుటకు తోడ్పడడం ప్రతి వైశ్యుడూ తమ విధిగా, కర్తవ్యంగా భావించాలి.

**గుప్త గారి శ్రీ కన్యకా పురాణ ప్రచురణకు సహకరించండి**

**– శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం విజ్ఞప్తి**

# సి.వి.సత్యనారాయణ శ్రేష్ఠి

**M.A., LLB.,**

మాటల్లో కాస్త కఠినత్వం కనిపించినా అప్పుడే తీసిన వెన్నవంటి మనస్సు కలవారు శ్రీ సత్యనారాయణ శ్రేష్ఠి గారు. ఏరంగూ, ఏరాజకీయ ప్రయోజనమూ ఆశించని వారు వీరు. వీరి ధ్యేయము ఒక్కటే. అవకాశం లభించిన మేరకు ప్రజలకు తన సేవలందించడమూ, స్వచ్ఛమైన రీతిలో వైశ్య జాతి పురోగమనం జరుగాలనడమూ 'ఒకే మాట, ఒకే బాట' అనేది ఈయనకు అత్యంత యిష్టమైన పద్ధతి. ముఖప్రీతికి మాట్లాడడమూ, మనస్సును చంపుకొని వ్యవహరించడమూ ససేమిరా గిట్టని వారు సత్యనారాయణ గారు. స్నాతకోత్తర విద్యను అభ్యసించి - న్యాయశాస్త్ర విద్యలో పట్ట భద్రులై - న్యాయ సూత్రాలను క్షుణ్ణంగా వంట పట్టించు కొన్న వీరు న్యాయవాద వృత్తిని ప్రారంభించి, ఆ జీవిత విధానానికీ, తన మనః ప్రవృత్తికీ - సరిపడక, ఆవృత్తినే మాను కొన్నవారు సత్యనారాయణగారు. ఆంధ్రాంగ్లములలో శ్రేష్ఠి గారు బాగా మాట్లాడతారు.

ఏ రంగూ - ఏ భావన లేని స్వచ్ఛమైన మనస్సుతో ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ, తదితర వైశ్య సంఘాలకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ, నిర్వహణలో జరుగుచున్న పొరబాట్లనూ, తప్పులనూ ఎత్తిచూపుచూ వీరు వైశ్య ప్రబోధినిలో అనేకవ్యాసాలు వ్రాశారు. ఆ వ్యాసాలు కల్మషము లేని మనస్సుతో వైశ్యసమాజ ప్రగతిని మాత్రమే లక్ష్యంగా ఉంచుకొని ఆలోచించే వారికి హర్షామోద ములను కలిగించగా, కొందరికి నిర్మాణాత్మక సూచనలుగా, ఆవశ్యకములుగా తోచగా వాటిలోని మంచిని గమనించలేనీ, గుర్తించలేని కొందఱికి ఆగ్రహాన్ని కూడ కలిగించాయి.

శ్రేష్ఠి గారు తన అసమానమైన అనువాద శైలిలో తెలుగులో అనేక శాసనాలలోని ముఖ్యాంశాలను అందరికీ అర్థమయ్యే రీతిలో వ్రాశారు. వాట న్నింటినీ వైశ్య ప్రబోధిని ప్రచురించింది. వాటిని చదివిన పాఠకులు శ్రేష్ఠి గారిని అభినందించారు. వాటిలో ఒకటి "ఆడవారికి ఆస్తిలో హక్కు" శ్రేష్ఠిగారి ఈ అనువాద వ్యాసాన్ని వైశ్య ప్రబోధిని 1986 జూలై సంచికలో ప్రచురించింది. శ్రేష్ఠిగారు ఈవ్యాసములో "ఆడపడుచులకు లభించిన ఆస్తిపై హక్కు"నే కాక "హిందూలా" అంటే ఏమిటి? ఆ "లా" పుట్టుటకు మూలాధారమేమిటి? అను అంశాలతోబాటు హిందూ వారసత్వ చట్టములోని అనేక విషయాలను సరళంగా సామాన్యులకు సహా అర్థమయ్యేటట్లు వ్రాశారు. ఈ వ్యాసమొక్కటే కాదు. వీరి వ్యాసాలు, అనువాదవ్యాసాలు అన్నీకూడ వివరంగానూ, తులనాత్మకంగానూ ఉంటాయి.

నిగర్వులు, నిరాడంబరులు,

నిష్కాపట్యులు, నిష్కాల్మషులు అయిన సత్యనారాయణ శ్రేష్ఠి గారు కర్నూలు జిల్లా నంద్యాల పట్టణములో 1937వ సంవత్సరము జూలై నెల 18వ తేదీన జన్మించారు. చిత్తలూరు సుబ్బలక్ష్మయ్య శ్రేష్ఠి గారు తండ్రి, తల్లి రాజమ్మ గారు. యస్.యస్.ఎల్.సి. వరకు నంద్యాలలోనే విద్యాభ్యాసము. యస్.యస్.ఎల్.సి. పరీక్షల్లో వీరు నంద్యాల పట్టణానికే ప్రథములుగా ఉత్తీర్ణత సాధించారు. అనంతరము గుంటూరు లోని హిందూ కళాశాలలో చదివి 1956లో బి.ఎ. పట్టాను స్వీకరించారు. తదుపరి 1956 నుండీ 1958 వరకూ బొంబాయిలోని "యూనివర్శిటీ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్"లో చదివి స్నాతకోత్తర (యం.ఎ) పరీక్షల్లో ఉత్తీర్ణులయ్యారు. యం.ఎ. చదువు చున్నపుడే బొంబాయిలోని ప్రభుత్వ న్యాయ కళాశాలలో చదివి యల్.యల్.బి. పట్టానుకూడ అందుకొన్నారు. 1960లో ఐ.ఎ.ఎస్., పరీక్షలోనెగ్గి ఆతరువాత జరిగిన మౌఖికపరీక్ష(ఇంటర్వ్యూ)లో ఉత్తీర్ణులు కాలేక పోయారు.

1954లో మద్రాసులోని దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారు నిర్వహించిన రాష్ట్రభాష పరీక్షకు హాజరై, ఆంధ్ర రాష్ట్రములోనే 'సర్వద్వితీయులు'గా ధృవపత్రాన్ని అందుకొన్నారు.

1961లో వీరి వివాహం శ్రీమతి నాగరత్నమ్మ గారితో జరిగింది. శ్రీమతి నాగరత్నమ్మ గారు ప్రసిద్ధకవి, పండితుడు, శతావధాని స్వర్గీయ దోమా వెంకట స్వామి గుప్త గారి కనిష్ఠ సోదరుని కుమార్తె.

దాదాపు దశాబ్దంపాటు న్యాయ వాద వృత్తిని అవలంభించి 1970లో ఆవృత్తికి 'స్వస్తి' పలికిన శ్రేష్ఠి గారు నంద్యాలలోని ఆర్యవైశ్య వృత్తి ఉద్యోగుల సంఘ నిర్మాతల్లో ప్రథములు. 1971లో ఏర్పడిన ఈ సంస్థకు శ్రేష్ఠిగారు దాదాపు పదిసంవత్సరాలు ఉపాధ్యక్షులుగానూ, ఆతరువాత కొన్ని సంవత్సరాలు కోశాధికారిగానూ ఉండినారు. 1974 నుండీ 76 వరకూ నంద్యాల పట్టణ ఆర్య వైశ్య సంఘం ఉపాధ్యక్షపదవిని నిర్వహించారు. వీరి కృషి, పట్టుదల ఫలితంగానే నంద్యాల "అహోపా విద్యానిధి" ఏర్పడింది. 1974లో ఏర్పడిన ఈ నిధి ప్రతిఏటా తన మూల ధనంపై వచ్చే వడ్డీతో కర్నూలు జిల్లాకు చెందిన పేద వైశ్య విద్యార్థులకు ఆర్థిక సహాయాన్ని అందిస్తూంది. 1956లో నంద్యాల పట్టణ సంక్షేమ మఱియు పన్ను చెల్లింపు దారుల సంఘము"ను స్థాపించారు. అప్పటి నుండీ ఆ సంస్థ కార్యదర్శి బాధ్యతను నిర్వహిస్తూ పట్టణ ప్రజల సమస్యల పరిష్కారమునకు కృషి చేస్తున్నారు.

తండ్రి ఇచ్చిన సంపదను చక్కగా, జాగ్రత్తగా కాపాడుకొంటూ ప్రశాంతంగా జీవితాన్ని ఆత్మతృప్తితో సాగిస్తున్న శ్రేష్ఠి గారు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ న్యాయ సలహా విభాగ సభ్యులుగా ఉంటూ ఆ సమాఖ్య అభివృద్ధికీ, రాష్ట్రములోని శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మసంస్థలు ఉనికీ, స్వతంత్ర ప్రతిపత్తి సంరక్షణకూ పై సమాఖ్య చేస్తున్న కృషికి ఎంతగానో తోడ్పడుచున్నారు.

## వైశ్యుడై పుట్టిన ప్రతి వ్యక్తీ తన ఇంట్లో తప్పని సరిగా ఉంచుకోవలసిన కేసెట్

వైశ్యులకుల దేవత శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరీ దేవికి ఇంత వరకూ అధికారికమైన సుప్రభాత సహస్రోత్తర నామములుగల కేసెట్ లేదు. ఈ ప్రధానమైన లోపాన్ని గుర్తించిన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మ సంస్థల సమాఖ్య. ఆంధ్రప్రదేశ్ శ్రీ వాసవీ సుప్రభాత, సహస్రోత్తర నామములను కమ్మగా, వీనుల విందుగా పాడించి, అత్యంత మధురమైన సంగీతముతో అధికారికమైనదిగా తయారు చేయించింది. పై గా ఇది కేవలము ప్రత్యేక మైన కేసెట్. 68 నిముషముల నిడివి గలది. ప్రతి కేసెట్టూ ఒరిజినల్ రికార్డింగు స్టూడియోలో రికార్డు కాబడినది. కేసెట్టు చిల్లర ధర రూ.30/-లు 25 కేసెట్లకు ఆర్డరు ఇస్తూ రూ.750/- యం.ఓ ద్వారా పంపితే, తపాలా ఖర్చులు లేకుండా పొందవచ్చు. 5 కేసెట్లకు ఆర్డరు ఇచ్చేవారు 150/- లు యం.ఓ పంపుచూ తపాలా ఖర్చులను కూడ వారే భరించాల్సి ఉంది. ఒకటి లేక రెండూ కేసెట్లు కావాలను కునేవారు వారి వారి పట్టణము లేక గ్రామములలోని శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయములో పొందవచ్చు.

ఉదార హృదయముతో ముందుకు వచ్చి ఒక వంద కేసెట్లను కొని వారి వారి పట్టణము లేక గ్రామములలోని వారికి పంపిణీ చేయడము ముదావహమైన విషయం కదూ! ప్రయత్నించండి. రూపాయలను శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి ఎడిటర్, వైశ్య ప్రబోధినీ, జయనగర్ కాలని, కడప - 516 002కు యం.ఓ ద్వారా పంపాలి. వీటి ప్రచార విషయములో పై సమాఖ్యకు సహకరించండి. ప్రశంసనీయంగా ఉంటుంది.

## గుంటూరు పట్టణ ఆర్య వైశ్య సంఘాధ్యక్షులుగా శ్రీ గుడివాడ

గుంటూరు పట్టణ ఆర్యవైశ్య సంఘం సర్వసభ్య సమావేశము 25.12.1994వ తేదీన జరుగ శ్రీ గుడివాడ వెంకటేశ్వర రావు గారు సదరు సంఘమునకు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఈ సందర్భంగా జరిగిన సభకు శ్రీ రంగా బాలకృష్ణ గారు అధ్యక్షత వహించారు. గుంటూరు జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ పాదర్తి పాండు రంగారావు గారు ముఖ్య అతిథులుగా ఈ సభలో పాల్గొన్నారు. గుంటూరు జిల్లా ఆర్యవైశ్య సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ కోట వెంకటేశ్వర రావు, శ్రీ కోట రామచంద్రా రావు ప్రభృతులు ఈ సమావేశములో నూతనాధ్యక్షుని అభినందిస్తూ ప్రసంగించారు.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

## కాక భుశుండి కథ

పార్వతి, నీవు ఇంతకు ముందు దక్షుని ఇంట జన్మించావు. అప్పుడు నీ పేరు సతీదేవి. దక్ష యజ్ఞ మందు నీకు అవమానం జరిగింది. అప్పుడు నీవు కోపించి ప్రాణ త్యాగం చేశావు. నా పరివారం యజ్ఞాన్ని ధ్వంసం చేసింది. అప్పుడు నా మనస్సు సంక్షోభం కలిగింది. నీ వియోగంతో దుఃఖించాను. నేను విరక్తుడనై సుందరమగు వనాలందు, పర్వతా లందు తిరుగుతూ వుండే వాణ్ణి. సుమేరు పర్వతానికి ఉత్తర దిశగా చాలా దూరంలో అతి సుందరమగు నీల పర్వతం వుంది. ఆపర్వతానికి అందంగా నాలుగు స్వర్ణ శిఖరాలు వున్నాయి. సుందరమైన ఆ నాలుగు శిఖరాలూ నాకు బాగా నచ్చాయి. ఆ శిఖరాలన్నిటిపైన విశాలమైన మర్రి, రావి, మామిడి వృక్షాలు వున్నాయి. పర్వతం పైన ఓ అందమైన తటాకంవుంది. మణి మయమైన దాని మెట్లు చూడగానే మనస్సు పరవశించి పోయింది. దాని నీరు చల్లగా, నిర్మలంగా, తియ్యగా వుంది. ఆ తటాకము వికసించిన రంగు రంగుల కమలాలతో నిండి వుండేది. హంసల మధుర స్వరాలతో తుమ్మెదల ఝుంకారాలతో కళ కళ్లాడుతూ వుండేది.

ఆ సుందర పర్వతం పైన కాక భుశుండి నివశిస్తూ వుండేది. ఆ పర్వతం కల్పాంతమున గూడా నశించదు. మాయ, మోహము, మదము మొదలగు దోషాలు ఆ సమీపానికి కూడా పోలేవు. అక్కడ నివసిస్తూ ఆ కాకి ఏ విధంగా హరిని భజిస్తూ వుండేదో, దాన్ని శ్రద్ధతో విను. ఆ కాకి రావి చెట్లు క్రింద ధ్యానము. మర్రి చెట్టు క్రింద జప యజ్ఞము. శ్రీహరి భజన తప్ప దానికి మరోపని ఏదీ లేదు. వటవృక్షము క్రింద శ్రీహరి కథలు చెబుతూ వుండేది. అనేక పక్షులు వచ్చి వింటూ వుండేవి. ఆ కాకి పవిత్రమగు రామచరితాన్ని అపరిమిత ప్రేమతో గానం చేస్తూ వుండేది. ఆ తటాకమందు నివసిస్తున్న బుద్ధికుశలత గల హంసలన్నీ వింటూ వుండేవి. నేను అక్కడకు వెళ్లి ఆసుందర దృశ్యాన్నిచూసి అమితంగా ఆనందించాను. అప్పుడు నేను హంస రూపం దాల్చి కొంతకాలం అక్కడ నివసించాను. ఆ రఘురాముని గుణ గణాలను ప్రేమతో వినిమరల కైలాసానికి వచ్చాను. ఇప్పుడు పక్షిరాజు గరుత్మంతుడు కాక భుశుండి వద్దకు వెళ్లిన కథ చెబుతాను, విను.

శ్రీరామచంద్రుని లీలలు చాలా విచిత్రంగా వుంటాయి. మేఘనాధుని నాగపాశంతో శ్రీ రామచంద్రుడు బంధింప బడ్డప్పుడు నారదుడు గరుత్మంతుణ్ణి పంపాడు. గరుత్మంతుడు వెళ్లి నాగపాశాన్ని కొరికి వేశాడు. శ్రీరామ చంద్రుడుని

బంధనాలను గురించి గురుత్మంతుడు అనేక విధాలుగా తర్కించు కున్నాడు- సర్వ వ్యాపకుడు, వికార రహితుడు, మాయామోహాలకు అతీతుడు, బ్రహ్మ స్వరూపుడు అయిన శ్రీ రామ చంద్రుడు భగవంతుని అవతార మని విని వున్నాను. ఎవని నామాన్ని జపించినంతనే మనుష్యులు సంసార బంధాలను తొలగించుకుంటారో, ఆ రాముడినే ఒక తుచ్ఛ రాక్షసుడు నాగపాశంతో బంధించాడు.

ఈ విధంగా గరుత్మంతుడు అనేక విధాలుగా మధన పడ్డాడు. మనస్సున భ్రమలు ఆవహించాయి. మనస్సునందు కుతర్కము ఎక్కువయింది. వ్యాకుల చిత్తంతో దేవర్షి నారదుని వద్దకెళ్లాడు. తన సందేహాన్ని వివరించాడు.

అప్పుడు నారదుడు "గరుత్మంతా, శ్రీ రామచంద్రుని మాయ ఎంతో బలీయమైనది. జ్ఞానుల చిత్తాన్ని గూడా హరించి వాళ్ల మనస్సులో గూడా మోహం జనింపచేసే ఆ మాయ నన్ను కూడా తికమకలు పెట్టింది. ఇప్పుడు ఆ మాయ నీకు కూడా ఆవహించింది. నేను నిన్ను వెంటనే సమాధాన పరచలేను. నువ్వు బ్రహ్మ వద్దకు వెళ్లి ఆయన చెప్పినట్లు చెయ్యి" అని చెప్పి నారద మహర్షి రామచంద్రుని గుణగణాలు కీర్తిస్తూ వెళ్లిపోయాడు.

అప్పుడు పక్షిరాజు బ్రహ్మ వద్దకెళ్లి తన సందేహం తెలియ పరచాడు. విషయంతా విన్న విధాత మనస్సులోనే శ్రీ రామచంద్రునికి ప్రణామం చేశాడు. ఆయన లీలలు స్మరించాడు. అత్యంత ప్రేమ భావనతో నిండిపోయాడు. ఆలోచనలో నిమగ్నమయ్యాడు- కవికోవిదులు, జ్ఞానులు గూడా మాయాధీనులు. భగవంతుని లీల అపారమైనది. ఆయన మాయ నన్నుగూడా అనేక మార్లు మోహపెట్టింది. ఈ చరాచర జగత్తంతా నాచే రచింపబడింది. అయినా నేనే మాయా వశుడనై భ్రాంతి చెందుతూ వుంటాను. మరి, ఈ పక్షిరాజు మోహవశుడగుటలో ఏమాత్రమూ ఆశ్చర్యంలేదు. అనుకుంటూ "గరుత్మంతా, శ్రీ రామచంద్రుని మహిమను మహాదేవుడైన శంకరుడెరుగును. నీవు ఆయన వద్దకెళ్లు. మరెక్కడా, ఎవరినీ అడగవద్దు, నీ సందేహం అక్కడనే తీరుతుంది." అన్నాడు. బ్రహ్మదేవుని హితవచనాలు వినగానే గరుత్మంతుడు కైలాసానికి బయలుదేరాడు.

పార్వతీ, అప్పుడు గరుత్మంతుడు వేగంగా నా వద్దకు వచ్చాడు. నేను ఆ సమయంలో కుబేరుని వద్దకు వెళ్లుతూ వున్నాను. నీవేమో కైలాసంలో వున్నావు. గరుత్మంతుడు ప్రేమ పూర్వకంగా నా పాదాలకు నమస్కరించి తన సందేహాన్ని వెలిబుచ్చాడు. అప్పుడు నేను ఈ విధంగా చెప్పాను.

గరుత్మంతా, నీవు నాకు దారిలో కలిశావు. ప్రయాణం చేస్తూ నేను నీకు సమాధానం ఎలా చెప్పేది? చిరకాలం సత్సంగము చేస్తే అన్ని సందేహాలు తీరిపోతాయి. ఆ సత్సాంగత్యమువలన సుందర మగు హరి కథలు వీనుల విందుగ వినవచ్చు. ఆది మధ్యాంత రహితుడగు శ్రీ రామచంద్రుడే సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడు. గరుత్మంతా ప్రతిదినం హరి కథలు గానమొనర్చ బడే చోటుకు నిన్నుపంపిస్తాను. నీవు అక్కడకు వెళ్లి అవి విను. నీ సందేహాలన్నీ తొలగిపోతాయి. అంతే కాకుండా నీకు శ్రీ రామ

చంద్రుని పాద కమలాల యందు అన ప్రేమ జనిస్తుంది.

సత్సంగము లేక శ్రీ హరి కథలను వినలేము. శ్రీ హరి కథలను వినకుండా మోహము విడనాడదు. ఆమోహము విడువనిదే శ్రీరామచంద్రుని పాదకమలాలయందు అచంచలమైన ప్రేమ జనించదు. ఆ ప్రేమ పొందకుండా కేవలం యోగ, తపో, జ్ఞాన వైరాగ్యాల చేత శ్రీ రఘునాధుని పొందలేము.

ఉత్తర దిశయందు సుందరమైన నీల పర్వతం వుంది. అక్కడ పరమ శీలవంతుడైన కాక భుశుండి నివసిస్తూ వున్నాడు. అతడు రామ భక్తులలో అగ్రగణ్యుడు. జ్ఞాని, గుణనిధి. అతడు చిరకాలంగా అక్కడే నివసిస్తున్నాడు. అక్కడకు వెళ్లి శ్రీహరి గుణగణాలను విను. అప్పుడు మోహం చేత జనించిన నీ సందేహం తీరిపోతుంది.

ఈ విధంగా నేను గరుత్మంతుణ్ణి సమాధాన పరచి పంపాను. పార్వతీ, నేను అతనికి ఏమీ బోధించలేదు. రాముడే అతని సందేహం తీర్చగలడు. పక్షులను పక్షియే సమాధాన పరచగలదు. భవానీ రామప్రభువు యొక్క లీల బహుబల వత్తరమైనది. ఆ మాయకు మోహపడని జ్ఞాని ఎవరుంటారు?

నిశ్చలమైన బుద్ధి కుశలతగల గరుత్మంతుడు పూర్ణ భక్తుడయిన కాక భుశుండి వద్దకెళ్లాడు. ఆ పర్వతాన్ని చూడగానే అతని మనస్సు పరమానందం పొందింది. అంతే కాకుండా క్రమంగా మాయ, మోహము, ఆలోచనలు అంతరిస్తూ పోయాయి. అక్కడి తటాకమందు స్నానంచేసి, జలపానం చేసి ప్రసన్న చిత్తుడై వటవృక్షము వద్దకు వెళ్లాడు. శ్రీ రామ చంద్రుని సుందర కథ వినడానికి ముసలి పక్షులన్నీ అక్కడకు వచ్చాయి. కాక భుశుండి కథ ప్రారంభం చేసే సమయానికి గరుత్మంతుడు అక్కడకు చేరుకున్నాడు.

గరుత్మంతుణ్ణి చూడగానే కాక భుశుండితో సహా పక్షులన్నీ ఆయనకు స్వాగతం పలికాయి. కూచోడానికి మంచి ఆసనం ఇచ్చాయి. కాక భుశుండి ప్రేమతో గరుత్మంతుణ్ణి పూజించి మధుర వాక్కులతో "పక్షిరాజా,మీ దర్శనంతో నేను కృతార్థుడనయ్యాను. మీరు ఏ కార్యం మీద ఇక్కడకు వచ్చారో దయచేసి తెలియ చేయండి." అని అడిగాడు.

## కాక భుశుండి ప్రబోధము

అప్పుడు పక్షిరాజా "ఆర్యా, నీవు కృతార్థుడవు. ఏ కార్యం మీద ఇక్కడకు వచ్చానో, అది ఇక్కడకు రాగానే పూర్తి అయినది. ఇంకా నీ దర్శనం కూడా అయింది. ఈ పరమ పవిత్రమైన ఆశ్రమం చూడగానే నా యొక్క మోహము, సందేహము, భ్రమలు తొలగిపోయాయి. ఆర్యా అత్యంత పవిత్రమై, ఎల్లప్పుడూ సుఖం కలిగిస్తూ దుఃఖాలను పార ద్రోలునటువంటి శ్రీ రామచంద్రుని కథ వినిపించమని నిన్ను నేను మరీ మరీ ప్రాధేయ పడుతున్నాను." అన్నాడు.

కాక భుశుండి ఆనందంతో రామ కథ చెప్పడం మొదలెట్టాడు.

పార్వతీ, మొదట అతడు మిగుల అనురక్తితో "రామ చరిత మానసం" స్వరూపం చెప్పాడు. తదుపరి నారదుని

అపారమైన మోహము, రావణుని అవతార కథ చెప్పాడు. తదుపరి శ్రీ రామచంద్రుని అవతార కథ వర్ణించాడు. తదనంతరం శ్రీ రామచంద్రుని బాలలీలలు మొదలు కొని రావణ సంహారం చేసి శ్రీ రాముడు పుష్పక విమానంపైన అయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషేకం చేసుకున్నంత వరకూ బహుచక్కగా వర్ణించాడు. కాక భుశుండి చెప్పిన శ్రీ రామకథనంతయు విని గరుత్మంతుడు పరమానందంచెంది ఈ విధంగా పలికాడు.

"ఆర్యా, శ్రీ రామచంద్రుని చరిత్ర నంతా నేను విన్నాను. నా సందేహం తీరిపోయింది. కాకశిరోమణీ నీ అనుగ్రహంతో శ్రీ రామచంద్రుని చరణాల యందు నా మనస్సు లగ్నమయింది, యుద్ధమందు శ్రీ రాముని నాగపాశ బంధనం చూసి నాకు మతిభ్రమ కలిగింది. ఇప్పుడు ఆ భ్రమ తొలగి పోయింది. ఎండలో వ్యాకులత చెందిన వాడే చెట్టు నీడ సుఖం తెలుసుకో గలుగు తాడు. నాకు ఆ భ్రమ కలగకుండా వుంటే, మిమ్మలను ఏ విధంగా కలుసుకో గలను? మీరు అనేక విధాలుగా గానంచేసి వినిపించిన శ్రీ హరికథ నేను ఏ విధంగా వినగలిగేవాణ్ణి? వేద పురాణాలన్నీ ఈ విధంగానే చెబుతున్నాయి. ఇందులో ఏ మాత్రమూ సందేహంలేదు. శ్రీ రామ చంద్రుడు ఎవరిని కృపతో చూస్తేవారికే సజ్జనుల సాంగత్యము ప్రాప్తిస్తుంది. శ్రీ రామచంద్రుని కృపతో నాకు మీ దర్శన భాగ్యం కలిగింది. మీ దయవలన నా సందేహం తీరిపోయింది."

గరుత్మంతుని ఈ ప్రేమ వాక్కులు వినగానే కాకభుశుండి శరీరం పులకించి పోయింది. ఆయన మనస్సు పరవశించి పోయింది. కళ్ల వెంట ఆనంద బాష్పాలు రాల్చి "ఆర్యా, మీరు శ్రీ రామచంద్రుని కృపకు పాత్రులయ్యారు. నాకు మీరు పూజ్యులు - మీకు సందేహము గాని, మోహముగాని, మాయగాని లేదు. నా పైన దయతో ఇచ్చటకు వచ్చారు. మోహం వైదొలగుట అనే సాకుతో శంకరుడు మిమ్మలను నా వద్దకు పంపాడు. ఈ విధంగా నాకు ఘనతను ప్రసాదించాడు. గరుత్మంతా, ఈ ప్రదేశం ఆశ్రమం కాదు. నారదుడు, శివుడు, బ్రహ్మ, సనకాది మహా మునులు ఉపదేశం చేయుటతో శ్రేష్ఠులు, లోకంలో కామం ఎవరిని ఆటలాండించం లేదు? తృష్ణ ఎవరికి మతిభ్రమ కలిగించడంలేదు? క్రోధం ఎవరి హృదయాన్ని జ్వలింప చేయడంలేదు! ఈ లోకంలో మోహం యొక్క ప్రలోభంలో పడని జ్ఞానులుగాని తపస్వీకులుగాని, శూర వీరులుగాని, కవులుగాని, పండితులుగాని లేరు. ధనం ఎవరికి మదం కలిగించడంలేదు? అధికారం ఎవరిని గర్విష్ఠులను చేయడం లేదు. స్త్రీల నేత్ర బాణాలకు ఎవరు గురి కావడంలేదు? త్రిగుణముల చేత ఎవరికి ఉన్మాదం కలగడంలేదు! అభిమాన, గర్వాలను అంటనివారు ఎవరూలేరు. యౌవన జ్వరం ఎవరిని కలత పెట్టడంలేదు! మమత్వము నాశనం చేయలేదు? మత్సరము ఎవరినికి కళంకం ఆపాదింప చేయడంలేదు! శోకము ఎవరిని కలత పెట్టడంలేదు! చింత అనే సర్పము ఎవరిని కాటు వేయపంలేదు? లోకంలో మాయకు బలిగానివాడు ఎవడున్నాడు?

(ఇంకా ఉంది)

## శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్రత సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "
టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,
పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

### వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీమాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.116/-లు చెల్లించిన వారికి సంవత్సరంనకు ఒకసారి ప్రసాదం పంపించబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి: 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము.. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు

యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో మరియు పేరు శిలాఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. తిరుమల మేదరిమెట్ట ప్రాంతంలో మనము కట్టుచున్న సత్రం దగ్గర కట్టిన షెడ్డులో తాత్కాలిక కార్యాలయం ప్రారంభించినాము.

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణము చేసి క్రింద భాగములో వైశ్యులు కళ్యాణంలు చేసుకొనుటకు గాని, యితర సమావేశములు, శుభకార్యములు చేసుకొనుటకు గాని తయారుచేస్తూ, మొదటి అంతస్తులో భోజనహాలు నిర్మాణం చేసి, నిత్య భోజనములు, రెండవ అంతస్తు నుండి వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు తీర్మానించినాము. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళంలు సమర్పించకోర్తాము.

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. రూము సైజు 200 చ.అ. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వ్రాయబడును. వీరికి

వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో-దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

M.Tech., ప్యాసు అయిన వారికి యీ సంవత్సరము రు.3500/-ల ప్రకారం ముగ్గురికి యివ్వబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు 1995లో స్వామి అనుగ్రహం మేరకు పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,
మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్య ప్రబోధిని - క్యాలెండరు

( 1995 జనవరి 21 నుండి 1995 ఫిబ్రవరి 20 వరకు )

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 22 | 29 | 5 | 12 | 19 |
| సోమవారము | | 23 | 30 | 6 | 13 | 20 |
| మంగళవారము | | 24 | 31 | 7 | 14 | |
| బుధవారము | | 25 | ఫిబ్రవరి 1 | 8 | 15 | |
| గురువారము | | 26 | 2 | 9 | 16 | |
| శుక్రవారము | | 27 | 3 | 10 | 17 | |
| శనివారము | 21 | 28 | 4 | 11 | 18 | |

జనవరి 24 :- శ్రవణ కార్తె రాక - ప. 3-05

జనవరి 26 :- సంపూర్ణ స్వాతంత్ర్యదినము (రిపబ్లిక్ డే) జాతీయ సెలవు దినము - దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు- సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

జనవరి 30 :– గాంధీ నిర్యాణ దినము – మృతవీరుల సంస్మరణ దినము.

జనవరి 31 :– మాఘ స్నానారంభము.

ఫిబ్రవరి 1 :– శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి ఆత్మార్పణ దినము.

ఫిబ్రవరి 2 :– రంజాన్ నెల.

ఫిబ్రవరి 6 :– రథ సప్తమి – ధనిష్ఠ కార్తె రాక – సా. 5–14.

ఫిబ్రవరి 15 :– చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

ఫిబ్రవరి 19 :– శ్రీ రామకృష్ణ పరమహంస జయంతి. శతభిషం కార్తె రాక – రా. 9–00.

ఫిబ్రవరి 20 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

**22, 29, 5, 12, 19 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# పౌరాణికమా? చారిత్రకమా?

( గత సంచిక తరువాయి )

ఖమ్మం వాస్తవ్యులు స్వర్గీయ శ్రీ చంద్రశేఖరగుప్తగారు "వాసవీ కన్యకా విషయాలు కన్యకాపురాణములోనే కాదు శివ పురాణము, వాయుపురాణం, దేవీ భాగవతం, దేవీపురాణము, మార్కండేయ పురాణం ఇంకాయెన్నిన్ని చోట్లనో గలవు" అని వ్రాశారు. స్కాంద పురాణంలోగానీ లేక యితర యే పురాణంలోగానీ యీ కథ ఉన్నట్లు ఋజువు చేస్తే రూ.116/-లు బహుమతిగా యిస్తామని ప్రస్తుతం చీరాలలో ఉంటున్న డాక్టర్ టి. ఆర్. క్రిష్ణన్‌గారు పది సంవత్సరాల క్రితమే పత్రికా ముఖంగా ప్రకటించారు. శ్రీ చంద్రశేఖరగుప్తగారికి కూడ ఆ ప్రకటనగల పత్రికలు అందినవి. అయితే ఆయన గానీ, యితరులుగానీ యింతవరకూ మూలమును చూపలేదు. ఆ కథా భాగం ఉన్న పురాణం లభిస్తే అంతకన్న సంతోషించాల్సిన విషయం గూడ యేదీ ఉండదు. ఎన్నో యేండ్లుగా అపరిష్కృతంగా ఉన్న ఒక ముఖ్య సమస్యను పరిష్కరించారన్న ఘనతకూడ చంద్రశేఖరగుప్త గారికి లభించేది. వైశ్య శాంకరీయం వ్రాసిన ప్రొద్దుటూరి వాస్తవ్యులు శ్రీ దుర్భాక వెంకటాచల శాస్త్రిగారు కూడ ఆర్యుల వారికి జవాబు యిస్తూ, తాను వైశ్య శాంకరీయంలో వైశ్యులను యోని భ్రష్టులుగాను, గోత్ర భ్రష్టులుగాను వ్రాసేందుకు, వారికొరకు పురాణోక్తం వ్రాసేందుకు ఆధారము స్కాంధమే అన్నారు. చూపించమంటే స్కాంధంగాదు, మార్కండేయంలో ఉంద న్నారు. అందులోగానీ మరియెందులో నైనా గానీ చూపించమంటే సమాధానం యివ్వలేక క్షమాపణ చెప్పుకొన్నారు.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీదేవి చరిత్రను కీర్తిశేషులు శతావధాని దోమా వెంకటస్వామిగుప్తగారు పద్యంలోనూ, గద్యంలోనూ గూడ వ్రాశారు. దీన్ని స్వర్గీయ జమిలి నమ్మాళ్వార్ తమ ధర్మనిధి తరపున ముద్రించారు. స్కాంధములోనే యీ కథ ఉంటే గుప్తగారు అందులోనుండే యధాతథాగా అనువదించి ఉండేవారు. బ్రహ్మవైవర్త పురాణాన్ని 15,000ల పద్యాలతో అనువాదం చేసిన ఆ పూర్ణప్రజ్ఞునికి స్కాంధాన్ని అనువదించుట పెద్దపని గూడ కాదు. దోమావారు తనకాలం వరకూ వెలువడిన అన్నిరకముల పరిశోధన ఫలితాలను అపారమైన తమ శాస్త్రానుభవంతోనూ, సాహిత్యంలో తనకుగల అధికారముతోనూ మేళవించి యీ పురాణాన్ని వ్రాశారు. ఇప్పుడున్న పురాణాలన్నింటి లోకీ ఉత్తమమైన పురాణం గూడ యిదే.

శ్రీ పోతులూరు వీరబ్రహ్మంగారి కాలనిర్ణయాన్ని గురించి ఆంధ్రప్రభలో ఒకవ్యాసంవ్రాస్తూ శ్రీ మరుపూరు కోదండ రామిరెడ్డి గారు "ఇతిహాసాన్ని పురాణం నుండీ వేరుచేయని భారతీయసంప్రదాయ దుష్ఫలితమే యిది" అని అన్నారు. శ్రీ వాసవీదేవి చరిత్రకు కూడ ఈ వాసనే సోకింది. ఇతిహాసంగా ఉన్న అంశాన్ని తీసుకవెళ్లి పురాణంతో జోడించి, చిలువలు పలువలుగా పెంచి, ఒక మంచి చరిత్రను నానా విధాలుగా సృష్టించారు. దీర్ఘకాలిక దృష్టితో చూడని వైశ్యులు అటువంటి వ్రాతలను పోషించి వాస్తవాన్ని మరుగున పడద్రోయుటకు తోడ్పడ్డారు. అదేస్థితి యిప్పటికీ కొనసాగుతూ ఉంది. వైశ్యులు, వైశ్యసంఘాలు యికనైనా మేల్కొని, యిటువంటి వ్రాతలకు మంగళం పాడ కుంటే భావిచరిత్ర వీరిని పరిహసిస్తుంది.

ఇక, ఈ కథ పౌరాణికమూకాదు, చారిత్రకమూకాదు. ఇది ఒక ఇతిహాసము. రామాయణము, మహాభారతము వంటి ఇతిహాసము. సర్వ ప్రపంచానికీ శాంతి పూర్వక అహింసా సిద్ధాంతాన్ని అందించిన మహత్తరమైన ఇతిహాసము. స్వార్థరహిత మనస్కులు, పక్షపాతరహిత బుద్ధులు, మసృణమనోజ్ఞ భావకవితా ప్రాభవంగల మంచి కవులకలానికి నోచుకోలేకపోవడమే యీ మనోజ్ఞ ఇతిహాసానికి వచ్చినలోటు. ఆ లోటును భావి కవిశేఖరులు తీర్చుతారని ఆశిస్తున్నాను.

పురాణంలో పేరు లేకపోయినా వాసవీ కన్యకాపరమేశ్వరీ కథతో బాగా ముడి వేసుకొన్నది పెనుగొండ. ఇప్పుడిది పశ్చిగోదావరి జిల్లా తణుకు తాలూకాలో నున్న పంచాయితీ గ్రామము. చారిత్రకంగా యీ పెనుగొండకు ఎంత ప్రసక్తి ఉన్నదని పరిశీలిస్తే12 వ శతాబ్దికి ఆవల యీ గ్రామానికి చరిత్రలో అంత యెక్కువగా ప్రసక్తి లభించదు. కానీ శ్రీ నండూరు రామకృష్ణమాచార్యులు తమ ప్రాచీన దక్షిణ భారత చరిత్రలో వ్రాసిన 399 వ పుటలోని యీ క్రింది విషయములో పేర్కొన్న తూర్పు చాళుక్యుల విషయాన్ని బట్టి పై శతాబ్దానికి మరి కొంత ముందుకు తీసుకపోవచ్చు. తూర్పు చాళుక్యుల కాలాన్ని ఆరవ శతాబ్ది నుండి 12 వ శతాబ్దివరకు చారిత్రకులు అంచనా వేశారు.

కృష్ణమాచార్యులు ఆ పుస్తకంలో యీ విధంగా వ్రాశారు– "ఈ కాలమున బ్రాహ్మణ పారమ్యము పేర్కొనదగింది. వారా కాలమున "శరాదీప" "శతాదీప"గా కొందరు వైదిక ధర్మాన్ననుసరింప, మరికొందరు శస్త్రోపజీవులై, దండనాథులై, మంత్రులై రాజ్యతంత్రమును నడుపుటకు నడుము కట్టిరి. వర్తకులు–కోమటులు ధనవంతులై అనేక దానధర్మము లొనర్చుచుండిరి. పశ్చిమ గోదావరీ మండలము నందలి పెనుగొండ వైశ్య సంఘమునకు కేంద్ర ముగ ఏర్పడెను. ఆదిలో వేయిమంది కలిసి యేర్పడిన 'తెలికి' వారి సంఘముగా నుండెడిది". ఆచార్యులవారీ వాక్యాలను తూర్పు చాళుక్యుల కాలాన్ని గూర్చి వ్రాస్తూ ఉటంకించారు.

పై వాక్యాలలో వేయిమంది కలసి

అని ఉంది. శ్రీనాథుడు తన హర విలాసంలో చిఱుతొండనంబి చరిత్రను ముగిస్తూ వసుధలో వేయి గోత్రాలవారి తోడ చిఱుతొండనంబిని స్వర్గానికి రమ్మంటాడు పరమేశ్వరుడు. ఆచార్యులు వ్రాసిన వేయిమందికి, యీ వేయి గోత్రాలకు యేదైనాసంబంధముందేమో? అయితే ప్రస్తుతం లభ్య మగుచున్న పురాణాల్లో యీ గోత్రాల సంఖ్య 7·12గా వ్రాయబడింది. ప్రస్తుతం లభించుచున్న వాసవీకన్యాకాపురాణాన్ని కన్న హరవిలాసం ముందుగా వ్రాయబడిందనే విషయం అవివాదాస్పదమైనది. ఈ గోత్ర సంఖ్య యిట్లుండగా కీ॥ శే॥ కోట వెంకటా చలంగారు తమ కలిశకవిజ్ఞానం ద్వితీయ భాగం 78 వ పుటలో "ఆంధ్రదేశంలో మూడు వందల ఆర్షేయ గోత్రములు గల బ్రాహ్మణులు, క్షత్రియులు, సుమారు రెండవందల గోత్రములుగల వైశ్యులును, అనేక గోత్రములతో కూడిన శూద్రులును నివసించుచున్నారు." అని వ్రాశారు. భావి పరిశోధకులు యీ ముగ్గురి వ్రాతలను తమ పరిశీలనలో నిగ్గు దేల్చ వలసిఉంది.

పెనుగొండ ప్రధాన వాణిజ్య కేంద్రముగా ఉండిందనేందుకు శ్రీ నండూరి రామకృష్ణమాచార్యుల వ్రాతలే కాక శ్రీ సిద్దాని నాగభూషణంగారు 1976 ఆంధ్రప్రదేశ్ పత్రికలో వ్రాసిన విషయము గూడ తోడ్పడుచున్నది.

"ఈ గ్రామం 12–15 శతాబ్దాల మధ్య కాలంలో వర్తక వాణిజ్యాలు చేసుకొనే వారి కేంద్రంగా, ప్రాంతీయపాలకుల రాజధానిగా విలసిల్లింది. రాష్ట్రమంతటా "కోమట్లుగా" పేరు పొందిన యీ ఆర్యవైశ్యుల జాతి పెనుగొండ నుంచి పెంపొందిందని చారిత్రకుల అభిప్రాయం. కులోత్తుంగ చోళుల తర్వాత ఈ ప్రాంతాన్ని వెలనాటి చోళులుపాలించారు. అప్పట్లో పెనుగొండ ఆర్యవైశ్యుల యిష్టదైవం పెనుగొండ "నగరేశ్వరుడు." 11వ శతాబ్దపుటేకి శాసనంలో ఈ "కోమటి" అనే పదం ఉన్నట్లు డాక్టరు వాల్ట్‌జీ గారు వ్రాశారు. వెలనాటి చోళుల కాలంలో ఉన్న కోమట్లు లేదా వైశ్యులు సమాజ సంక్షేమము కోసం కృషిచేశారు. పెనుగొండవైశ్యులు ధర్మకార్యాలను యీ నాటికీ చేస్తున్నారు. ఇటీవల కొన్ని సంవత్సరాల త్రవ్వకాలలో వెలువడిన "గంట, నిచ్చెన" ను బట్టి యీ గ్రామము ఒక జాతికి రాజధానిగా విలసిల్లిందని తెలియ వస్తున్నది. 15వ శతాబ్దిలో పెనుగొండ వైశ్యుల ప్రాముఖ్యం నన్నగిల్లింది. కపిలేంద్ర గజపతి కాలములో వ్రాసిన శాసనాన్ని బట్టి కళింగ సామ్రాజ్యంలో యీ ప్రాంతాన్ని కలిపివేసినట్లు తెలుస్తున్నది."

పై వాక్యాలలో శ్రీ నాగభూషణగారు ప్రాంతీయ పాలకుల రాజాధానిగా విలసిల్లిందని యే ఆధారాలను బట్టి వ్రాశారో తెలియదుకాని శాలివాహనశకం 1080 అనగా క్రీస్తుశకం 1148వ సంవత్సరమున వ్రాయబడిన శాసనమును బట్టి యీ పెనుగొండకు "పోతిసెట్టి" అను వైశ్యుడు సామంతరాజుగా ఉన్నట్లుగా

కాకతీయాంధ్రరాజుల చరిత్రలో వ్రాయ బడి ఉంది. ఇంత వరకు లభించిన శాసనా లన్నింటిలో కూడా పెనుగొండ వైశ్యులు తమది "కుబేరవంశ" మనే చెప్పుకొన్నారు.

పెనుగొండకు సంబంధించి యింతకు మించి చారిత్రకాంశాలు లభించలేదు. ఈ గ్రామములో లింగాలవీధిలో యిప్పటికీ పునాదులు మొదలగునవి తీయునపుడు లింగాలు బయటపడడంజరుగుతూఉంది. ఆ వీధిలో పానుమట్టముతో కూడా కన్పిస్తున్న పెద్ద శివలింగం యిలాంటి త్రవ్వకాళ్లు జరుగుచున్నపుడు బయల్పడి నదే. వేంగీచాళుక్యులు అనితర శివ పూజాపరాయణులు. లింగప్రతిష్ఠయెడ వారికి మక్కువ యెక్కువయట. కొన్ని వేల శివలింగాలను వారు తమ రాజ్యములో ప్రతిష్ఠించారని చారిత్రకుల వ్రాతలు. అందువలన యిచ్చట శివలింగాలు వెలువడడానికి వేంగీశులు చేసిన ప్రతిష్టలే కారణం కావచ్చు.

ఇక్కడ ఉన్న గుడి నిర్మాణాన్ని పరిశీలిస్తే ప్రాధాన్యత అంతా నగరేశ్వరునికే ఉన్నట్లు కనిపిస్తుంది. ప్రస్తుతం వాసవీ కన్యకాపరమేశ్వరిగా పూజలందుకొను చున్న అర్చామూర్తి నగరేశ్వరునికి కుడివైపున ప్రతిష్ఠించబడి ఉంది. ఎడమ వైపున మహిషాసురమర్ధని ఉంది. దీన్ని బట్టి కొందరు యిచ్చటి నగరేశ్వరున్ని "దక్షిణనాయకుడు"గా భావిస్తున్నారు. కానీ యిది తప్పు. యానాం జమీందార్ మన్నెం కనకయ్యగారు యీ ప్రతిమను అచ్చటికి తీసుకపోవడం. ప్రతిష్ఠించటం చేశారు. అంతకుముందు యిప్పుడు బృహత్ లింగంఉన్న ప్రాంతములో అంటే లింగాలవారివీధి మధ్యలో జగన్మాత శ్రీ వాసవీ దేవి ఆలయం ఉండేదనీ, ఆ దేవాలయం శిథిలంకాగా, అచ్చటి ప్రతిమను కనకయ్య గారు తీసుకొని యిప్పటి స్థానంలో ప్రతిష్టించారనీ తెలుస్తూంది. లింగాల వీధిలో మాతృశ్రీ ఆలయం ఉన్నది అనేందుకు ఆధారాలు లేవు. కానీ మన్నెం కనకయ్యగారు యిప్పటి అర్చామూర్తిని ప్రతిష్ఠించినా రనేందుకు ఆధారాలు కన్పిస్తూ ఉన్నవి.

"లింగాలవీధిలో మాతృశ్రీకి పెద్ద దేవాలయం ఉండేది. అది శిథిలం కాగాకొంత కాలానికి మన్నెం కనకయ్యగారు యీ మూర్తిని తీసుక వెళ్లి యిప్పటి స్థలములో ప్రతిష్ఠించారు" అనే విషయాన్ని ఒక ముసలి వైశ్యుడు తనతో చెప్పినట్లుగా కీర్తిశేషులు పండిత శ్రీ జమిలినమ్మాళ్వార్ గారు చాలామార్లు చెప్పేవారు. ఇందలి సత్యాసత్యాలు భావి పరిశోధనలో నిర్ణయం కావాల్సి ఉంది.

"ఇప్పుడు అర్చామూర్తిగా ఉన్న మాతృశ్రీ విగ్రహంలో యేదో కొరత తనకు కన్పిస్తూ ఉన్నదని, శిల్ప సాంప్రదాయాన్ని పరిశీలించి, ఒక నిర్ణయానికి రావడం అవసరం" అనిగూడ ఆయన అనేవారు.

వారసత్వంగా చెప్పుకొంటున్న విషయాన్ని బట్టి పురాణములో వ్రాయ బడ్డ విషయాన్ని బట్టి శ్రీ వాసవీదేవి బాలికగాను, కన్యగాను ఉండాలి. కానీ

యిచ్చటిమూర్తి పరిపూర్ణయవ్వనిగా, సాలంకృత కర్ణభూషణిగా కన్పిస్తూంది. కుడిచేత తామర మొగ్గను ధరించునట్లుగా చెక్కబడింది. తామర మొగ్గను ధరించి ఉండడం శిల్పశాస్త్ర పరిభాషలో కన్యాత్వసూచకమని కొందరి భావన.

ఇచ్చటి అర్చామూర్తిలోని శిల్ప సాంప్రదాయాన్ని పరిశీలించినవారు ఈ శిల్పం బాదామీ శిల్పుల సాంప్రదాయానికి చెందినదిగా భావిస్తున్నారు. ఈ బాదామి రాజులకాలం చాళుక్యుల కాలానికన్నా ప్రాచీనం. ఇందలి వాస్తవికత ఏమిటో యిదమిత్థంగా తెలియుటలేదు.

పురాణాన్ని బట్టి వింధ్యవాసినీ నగరేశ్వరులు ఒక ప్రక్క, కోనకమల, జనార్దనులు ఒక ప్రక్క ఉండగా మధ్యలో శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీదేవి ఉండాలి. వరుసక్రమములో ఉండకపోవడమేగాక, యిచ్చట వింధ్యవాసినీదేవి ప్రసక్తేలేదు. మహిషాసురమర్దని మాత్రమే ఉన్నది. కోనకమల జనార్దనుల ఆలయాలు యీ దేవాలయ పరిధిలోనేలేవు. పరిపాలకవర్గం కూడ యీ రెండు దేవాలయాలకు విడివిడిగానే నియమింపబడుచూ ఉంది. పోతే ప్రధాన దేవతయైన శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీదేవి గుడిలో కుడివైపున చిన్న గదిలో ప్రతిష్ఠించబడింది.

పెనుగొండ వాస్తవ్యులైన పూర్వ వైశ్యులు ఎందరో ఎన్నో రకాల దాన ధర్మాలు చేశారు. గుళ్ళు, గోపురాలు కట్టించారు. తటాకాలు, నూతులు త్రవ్వించారు. మడులు మాన్యాలుదానం యిచ్చారు. వారుచేసిన దానాలన్నింటినీ శిల, తామ్రశాసనాలలో చెక్కించారు కూడ. "వెలనాటి చోళులకాలములోని వైశ్యులు తమ కాలములో దాన ధర్మాలు చేశారు, అని శ్రీ సిద్దాని నాగభూషణంగారు వ్రాయడానికి యీ శిలా, తామ్ర శాసనాలే ఆధారం కావచ్చు. పెనుగొండకు సంబంధించి యితవరకు ఇరవైకి పైగా శాసనాలు లభించాయి. శ్రీ గ్రంధి వెంకటలింగంగారు వీటిలో కొన్నింటిని స్వర్ణోత్సవ సంచికలో ప్రకటించారు. కీ॥ శే॥ ఆలపాటి సాంబశివరావుగారు కూడ యిందులో కొన్నింటిని వైశ్యప్రబోధినీ పత్రిక ద్వారా పాఠకుల దృష్టికి తీసుకవచ్చారు.

పురాణములో మాత్రం మూలంలో ఎక్కడా "పెనుగొండ" అని లేదు. "బృహదద్రి" అనే ఉంది.

ధర్ట్సన్ పేర్కొన్నట్లుగా చెప్ప బడుచున్న కోటిలింగ శాసనాన్ని బట్టి కీ. శ. 1448 ప్రాంతములో కపిలేశ్వర గజపతి ఈ పెనుగొండను దగ్ధంచేసినట్లుగా కొందరు చారిత్రకులు భావించారు. ఆ శాసనమందలి "పెన్గొండాఖ్యపురోత్తమం గజపతిక్షోణీశ సందీపితమ్" అను శ్లోకభాగమే వారి యీ ఊహకుఆధారం. ఆ తగులబెట్టడము యే సందర్భములో జరిగిందో తెలియుటలేదు. *

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

రాజేశ్వరరావుగారు విశాఖపట్టణంలో వున్న సమయంలో ఆంధ్ర యూనివర్సిటీ లైబ్రరీలో నవీన రాజకీయ గ్రంథాలు చాలా ఉండేవి. బారిష్టరు ముఖర్జీ అనే ప్రొఫెసరుగారు వాటిని సేకరించి పెట్టారట. అవి మాకు చదువుకోటానికి లభించేవి. ముఖర్జీగారు వెళ్ళిపోయిన తరువాత వేసంగి శెలవులలో అలాంటి పుస్తకాలన్నింటిని ఏరి తన బంగళాలోని బీరువాలలో పెట్టి తాళంవేసి, సీలువేశారట వైస్‌ఛాన్సలర్ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు. అందువల్ల మా చదువులకు ఆటంకం కలిగింది; విద్యార్థులకు ఆయనపట్ల అసంతృప్తి పెరిగిపోయింది.* తరువాత మరల 1938లో మేము మద్రాసులో స్థిరావాసం ఏర్పరుచుకున్నాము.

## కాంగ్రెసు – ప్రజాసంఘాలు

కాంగ్రెసు సోషలిస్టుల మయ్యాక ఆపార్టీని బలపరచాలనే ఉద్దేశంతో ఫెయిజ్‌పూరు (1936) హరిపుర (1938) కాంగ్రెసు మహాసభలకు నేనూ, నా భార్య వెళ్ళాము. స్వరాజ్యాన్ని గూర్చిన చర్చలు మాత్రమే నాకు యిప్పటివరకు జ్ఞాపకమున్నాయి.

విషయ నిర్ణయ సభలో డాంగేగారు ఒక ప్రతిపాదన తెచ్చారు. ఇండియాలో ఉండే ప్రజా సంఘాలను కాంగ్రెసుకు అనుబంధంగా చేర్చుకోవాలని, వాటిలో వుండే సభ్యుల దామాషా ప్రకారం ప్రతినిధులను కాంగ్రెసుకు పంపవచ్చునని తీర్మానం తెచ్చారు. దీనిని ఆచార్య రంగాగారు బలపరిచారు. అనగా అఖిల భారత

---

* శ్రీ రామలింగారెడ్డిగారితో నాకు పరిచయం లేదు. కాని, ఒకటి రెండు పనులు చేయించుకోవాల్సి వచ్చింది. 1928–30లో స్కూలు ఫైనల్ తప్పిన ఆంధ్ర విద్యార్థినులు ఇంటరులో చేరుటకు ఆంధ్ర యూనివర్సిటీలో అవకాశం ఉంది. ఆంధ్ర యూనివర్శిటీ యేరియాకు వెలుపల చదువుతున్న ఆంధ్ర విద్యార్థినులకుకూడ అదే సౌకర్యాన్ని యివ్వమని కోరాము. శ్రీ తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు, శ్రీ కాశేశ్వరరావుగారు, నేనూ కమిటీగా ఏర్పడి ప్రయత్నించాము. కాని, సిండికేటు మీటింగులో శ్రీ రెడ్డిగారు అంగీకరించలేదు. శ్రీ రెడ్డిగారి అభిప్రాయాన్ని ఆక్షేపించుతూ వోటు చేసినవారు విదేశీ ప్రిన్సిపాలులు (గుంటూరు, బందరు కాలేజీలు) కాకినాడ కాలేజీ ప్రిన్సిపాలు రామకృష్ణారావుగారు మాత్రమే.

మరొక విషయంకూడ జ్ఞాపకం వున్నది. పశ్చిమ దేశాల్లో డిగ్రీ పొంది వచ్చిన ఆంధ్రులను ఆంధ్ర యూనివర్సిటీ గ్రాడ్యుయేట్సు లిస్టులో చేర్చుతారనీ, శ్రీ బాపినీడుగారు చేరారనీ తెలిసి నేను అర్జీ పెట్టుకొన్నాను. శ్రీ రెడ్డిగారు ఆక్షేపించినందున నా అర్జీ అంగీకరింపబడలేదని తెలిసింది. ఆయన నేమి కారణాలు బాధించాయో!

కార్మిక సంఘం, కర్షక సంఘములవారు ఈ తీర్మానాన్ని తెచ్చారు. నెహ్రూగారు అధ్యక్షులు. చాలా బాగున్నదని సమ్మతించారు. తరువాత కాంగ్రెసు వర్కింగు కమిటీ తరపున సర్దార్ శ్రీ వల్లభాయి పటేలుగారు తీర్మానాన్ని ఎదిరించారు. ఎన్నో సంవత్సరాలుగా కాంగ్రెసులో పనిచేసి, దానిని వృద్ధికి తెచ్చి, చివరకు కాంగ్రెసును డాంగే, రంగాల హస్తగతం చేసి, రాజకీయంగా తాము ఆత్మహత్య చేసుకొనుటకు సమ్మతించ జాలమని వారి వాదన.

పటేలుగారు ఇంతగొప్ప ప్రజా సమూహాలతో కూడిన ఉద్యమాల సమస్యను వ్యక్తిగతంగా మార్చారని అందరికీ అర్థమైంది. అఖిలభారత కిసాన్, కార్మిక సభలలో చాలమంది సభ్యులున్నారు. ప్రతినిధులెక్కువ మంది రాగలరు; కాంగ్రెసు పెత్తనం కార్మిక, కర్షకుల చేతుల్లోకి పోతుంది. తాము కోరుతున్న పెట్టుబడిదారీ స్వరాజ్యానికి బదులు కార్మిక-కర్షకుల సోషలిస్టు స్వరాజ్యం ఏర్పడుతుందనీ, అందుకు కాంగ్రెసు వర్కింగుకమిటీ సమ్మతించ జాలదనీ సర్దారుగారు వాదించివుంటే బాగుండేది; కాని డాంగే, రంగాలను వ్యక్తిగతంగా ఎదుర్కొన్నారు. చివరకు జయించారు కూడాను. చంద్ర రాజేశ్వర రావు చెప్పినట్టు కాంగ్రెసులో నానా వర్గాలు ఉన్నప్పటికీ అది బూర్జువా సంస్థయనీ, వారి పలుకుబడిలో వున్నదనీ, బాగా తెలిసి పోయింది. సంశయ నివారణ అయింది. కార్మిక-కర్షక సంఘాలను కాంగ్రెసు నాయకులు బలపరచకపోగా, అవి వృద్ధి చెందుతూంటే తమ కాంగ్రెసు సంస్థకు పోటీసంఘాలని నిందించి నాశనం చేయుటకు ప్రయత్నించుతారనే భావాలు నాలాంటివారిలో నాటుకున్నాయి. కాంగ్రెసు సోషలిస్టులు జాగ్రత్తపడాలనీ, కార్మిక-కర్షకులను సంఘటిత పరచాలనీ అనుకున్నాము.

## పోరాటానికి కాంగ్రెసు వ్యతిరేకత

సుందరయ్యగారు మరో తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. రెండవ ప్రపంచయుద్ధం రాబోతున్నది. ప్రపంచాన్ని మళ్ళీ పంచు కొనుటకు సామ్రాజ్యదేశాలు యుద్ధం లోకి వురకబోతున్నాయి. ఇండియాకు స్వరాజ్యం సంపాదించు కోడానికి ఇదే సరియైన అదును; కాబట్టి, ఇప్పటినుండే స్వరాజ్య స్థాపనకు అవసరమైన అంతిమ పోరాటానికి తయారు చేసుకుందామని సుందరయ్యగారు చెప్పారు. అంతేకాదు; కార్మికులను, కర్షకులను, విద్యార్థులను వారి వారి వర్గ సంఘాల్లో సంఘటిత పరచి యుద్ధం రాగానే జనరల్ స్ట్రయిక్ చేసి, రైళ్ళు, బస్సులు మొదలైన రవాణా మార్గాలను నిలిపివేసి, రేవులలో దిగుమతి ఎగుమతులను ఆపివేస్తే బ్రిటిష్ ప్రభుత్వం ఆట కట్టివేయించివచ్చుననీ, వారిని తరిమివేయవచ్చుననీ సుందరయ్యగారి ప్రతిపాదన. ఇందువల్ల హింస వుండదనీ, గాంధీగారి వాదము ప్రకారమే చేయగలుగుదుమని కూడా ఆయన విశదీకరించారు. అయితే కాంగ్రెసు వర్కింగు కమిటీ అంగీకరించలేదు. వర్కింగ్ కమిటీ తరపున

శ్రీ సర్దార్ పటేలుగారే ప్రతిఘటించి మాట్లాడారు.

పటేలుగారి వాదనలోని సారంశం ఏమంటే "రెండవ ప్రపంచ యుద్ధం రాబోతున్నది వాస్తవమే. ఆ సమయంలో స్వరాజ్యం సంపాదించుకోవలసినదే కాని ఎలా సంపాదించుకోవాలి? మేమెన్నిసార్లు యిలాంటి ఉద్యమాలను నడపలేదు; ఏమి చెయ్యాలో మాకు తెలియదా?" అని వాదించారు. సుందరయ్యగారి (కాంగ్రెసు సోషలిస్టుల) ప్రతిపాదన ఓడిపోయింది.

సుందరయ్య ప్రతిపాదన వారెందుకు ఒప్పుకోలేదు? కార్మికులను, కర్షకులను సంఘటిత పరచాలిగదా? సంఘటిత పరిస్తే సంపూర్ణ స్వరాజ్యం వస్తుందనికూడా కాంగ్రెసు నాయకులకు తెలుసు. కాని దానితో పాటు సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడ వచ్చునన్న భయం వారిలో తిష్టవేసింది.

హరిపుర కాంగ్రెసు నుండి నేను, నా భార్య తిరిగి మద్రాసుకు వచ్చాక కార్మిక సంఘాల్లో పనిచేయుటకు పూను కున్నాము. 1939లో ప్రపంచయుద్ధం ప్రారంభ మైంది. కాంగ్రెసు కమిటీలు వార్ధాలో సమావేశమైనాయి. బోసుగారేమో నాగపూరులో మహాసభ పెట్టారు. ఈ రెంటికి వెళ్ళాను. కాంగ్రెసు చేసిన తీర్మానం బాగాలేదు. "ఇండియాకు స్వరాజ్యం యిస్తారా?" అని బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వాన్ని అడిగారు. ఇవ్వదని తెలియదా?. కాంగ్రెసు కార్యాచరణకు సంశయించుతూ తాత్సారం చేయ సాగింది. అతివాద పార్టీలు చాలా చిన్నవి. పలుకుబడి లేదు; కార్యాచరణకు ప్రారంభిచాయి. కాని ఏమి చేయగలవు? జాతీయ నాయకత్వం తన బలాన్ని ఉపయోగించుటకు పూను కోదయ్యె!

## కమ్యూనిస్టులతో పరిచయం

మద్రాసులో కార్మిక సంఘాలలో కాంగ్రెసు సోషలిస్టుగా పని చేయుచున్న సందర్భంలో ఈ పార్టీ నాయకులు కమ్యూనిస్టులని తెలిసింది. వారు కార్మికుల కొరకు ఉత్సాహంగాను, వాస్తవంగాను శ్రమపడటం చూచి వారిమీద నాకున్న అపోహలు, సందేహాలు పోయి, వారి యందు నాకు గౌరవ, ప్రేమ లేర్పడుతూ వచ్చాయి. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే వీరు చాల తీవ్రంగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కొంటూ వచ్చారు. అది కూడా నాకు వచ్చింది. అందువల్ల నాకూ కమ్యూనిస్టులకు స్నేహం వృద్ధి చెందసాగినది. మద్రాసులో కమ్యూనిస్టు పార్టీ నాయకుడు కామ్రేడ్ ఘాటే, ఆయన నిష్కళంక జీవితము, దేశ భక్తి, మానవసేవ, రాజకీయ విజ్ఞానము మమ్మ బాగా ఆకర్షించాయి. యుద్ధం ప్రారంభం కాగానే ఆయన నన్నీవిధంగా అడిగారు.

"సంపూర్ణ స్వరాజ్యం సంపాదించుటకు మంచి తరుణం వచ్చింది. మనం గెలిచినా, ఓడినా, మన విధిని మనం నెరవేర్చుకోవాలి. బ్రిటిష్ ప్రభుత్వంతో కమ్యూనిస్టులకు పోరాటం తప్పదు. కొందరు వుండి పోరాటం జరపాల్సి వుంటుంది. మరికొందరు కార్మిక, కర్షక, విద్యార్థి సంఘాలలో పనిచూస్తూ గవర్నమెంటును ఎదిరించాలి. అట్టివారికి

అరెస్టులు, జైళ్ళు తప్పవు. నువ్వేమి చెయ్యదలచావు?" నేను, సుభద్రమ్మ ర్మిక సంఘాల్లోనూ, ప్రజాహిత కార్యాల్లోను పనిచేస్తున్నాము. మాలో ఒకరు పిల్లల్ని, సంసారాన్ని చూచుకోవాలి. నా భార్య బాగా చూచుకోగలదు. నేను మాత్రం కమ్యూనిస్టుపార్టీ యిచ్చేపనులు చేయటానికి సిద్ధంగా వున్నాను. బహిరంగంగా చెయ్యవలసిన పనులు చేస్తానేగాని, రహస్యంగా ప్రచ్ఛన్నంగా మాత్రం నేను చెయ్యలేను. ఉద్యోగం చాలించుకోటానికి సిద్ధమే. ఎన్ని కష్టాలు వచ్చినా అనుభవించడానికి తయారుగా వున్నా"నని చెప్పాను.

అందుకు ఘాటేగారు యిలా అన్నారు! "కమ్యూనిస్టులను, కార్మిక, కర్షక నాయకులను, విద్యార్థి నాయకులను అరెస్టుచేసి, జైలులో పెట్టడం ప్రారంభమవుతుంది. కాంగ్రెసు మంత్రివర్గాలే మనలను శిక్షించుతాయి. మద్రాసులో కార్మికనాయకులు అరెస్టు అయినప్పుడు నీవు వారిస్థానంలో వుండి, చెయ్యగల పనులను చెయ్యాలి" అని సలహాయిచ్చారు.

## స్వరాజ్యం గురించి కాంగ్రెసువారి అంచనాలు

అప్పుడు మద్రాసురాష్ట్ర జైళ్ళశాఖా మంత్రి (కాంగ్రెసు) డాక్టరు సుబ్బరాయను గారు. కామ్రేడ్సు అజయఘోష్, ఎ.యస్.కె. అయ్యంగారు, నేను కలసి జైళ్ళమంత్రి వద్దకు డెప్యూటేషను వెళ్ళాము. జైళ్ళలో రాజకీయ ఖైదీలకు కొన్ని సౌకర్యాలు చెయ్యమని కోరాము. గవర్నమెంటువద్ద డబ్బు లేనందున ఎలాంటి సౌకర్యాలు చేయడానికి సాధ్యం లేదన్నారు. ప్రభుత్వం ఖర్చుపెట్టవసరం లేదనీ, రాజకీయ ఖైదీలు తమ స్వంత డబ్బుతో తమ కిష్టమైన బట్టలు, పుస్తకాలు, వార్తా పత్రికలు, మందులు, ఆహార పదార్థాలు, సిగరెట్లు వగైరా కొనుక్కొనుటకు ఉత్తరువు యిస్తే చాలునని అడిగాము. అలాంటి మార్పులను చెయ్యవలసిందని తాను అంతకు ముందే మంత్రివర్గాన్ని అడిగినట్లున్నూ, అందుకు వారు సమ్మతించలేదనీ చెప్పారు. కారణమేమని అడిగాము. రహస్యం బయటపెట్టడడానికి యిష్టం లేకపోయినా చివరకు "ఇప్పుడు కాంగ్రెసు పార్టీ అధికారంలో ఉన్నది. ఈ పార్టీకి విరోధులు మాత్రమే జైళ్ళకు వెళ్ళారు. వారికి కాంగ్రెసు మంత్రులు సౌకర్యాలు ఎందుకు చెయ్యాలె?" అని కాంగ్రెసు మంత్రుల అభిప్రాయంగా చెప్పారు. "హిందీ వ్యతిరేక వాదులు" మీ మనసుల్లో వుండవచ్చునని మేమన్నాము. అందు కాయన నవ్వారు. మేము విషయం గ్రహించాము.

డాక్టరుగారు అంతటితో ఊరుకోలేదు. ఆయన జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలను గురించిన గ్రంథాలెన్నో చదువుతారు. కాబట్టి తనకు చాలా తెలుసునని అనుకుంటారు. అంతటితో వూరుకోక మాతో రాజకీయ చర్చ ప్రారంభించారు. ఈ యుద్ధకాలంలో మనకు స్వరాజ్యం యివ్వక తప్పదు. మనం జైళ్ళకు వెళ్ళవలసిన అవసరంలేనేలేదు. కాంగ్రెసుపార్టీ సహాయం లేకపోతే గవర్నమెంటు స్తంభించి పోతుంది.

మనకాళ్ళమీదపడి, రాజ్యం చెయ్యండని కాంగ్రెసును బ్రతిమలాడక తప్పదు" అన్నారు మంత్రిగారు.

"బ్రిటిష్ గవర్నమెంటు అంత అసహాయ స్థితిలో లేదు. పోలీసు, మిలిటరీ బలాలతో రాజ్యం చేస్తారు. ఈయుద్ధంలో ఇండియాను పోగొట్టుకొని, తమ సామ్రాజ్యం దివాలా యగుట కెంత మాత్రమూ సమ్మతించరు. అడ్డమొచ్చిన వారిని నాశనం చేస్తారు. కాంగ్రెసు కష్టాలు పడుటకు సిద్ధంగా ఉండాలి; రక్తప్రవాహం జరుగుతుంది" అని మేము గట్టిగా చెప్పాము. కమ్యూనిస్టులు, అతివాదులు ఎంతో అజ్ఞానులని వారు జాలి వెల్లడించారు. కాంగ్రెసు నాయకులు రాజకీయ విజ్ఞానంలో ఇంకా బాల్యం స్థితిలోనే ఉన్నారని మేము మా విచారాన్ని వెలిబుచ్చాము అయితే, డాక్టరుగారు మాతో కార్మిక కర్షక నాయకులు జైలుకు వెళితే, తనతో చెప్పవలసిందని, ప్రతి వ్యక్తి విషయంలోను ప్రత్యేకంగా సౌకర్యాలు కలిగిస్తూ ఆర్డర్లువేస్తాననీ చెప్పి ఆశపెట్టారు. "మీ రెంత కాలం మంత్రిగా ఉండగలరు? కొద్దిమాసాల్లో మీరుకూడా జైలుకు వెళ్ళక తప్పదే! మీరు ఎంత అజ్ఞానులు!" అని మేము జవాబిచ్చాము. డాక్టరుగారు మా అజ్ఞానానికి కాబోలు నవ్వారు.

ఒక సంవత్సరం గడవకముందే మే మందరం జైళ్ళలో కలుసుకొన్నాము. "డాక్టరుగారూ! బ్రిటిష్ గవర్నమెంటు కాంగ్రెసు నాయకుల కాళ్ళమీద యింకెప్పుడు పడుతుంది?" అని పరిహాసం చేశాము.

అంతే కాదు; ప్రపంచ యుద్ధ సంబంధమైన మిలిటరీ విషయాలను గురించి, జయాప జయాలను గురించి కూడా మా డెప్యుటేషనుకు ఉపన్యాస మిచ్చారు. "ఫ్రాన్సులో ఉండే మాజినాటు దుర్గశ్రేణిని దాటి జర్మనులు పోజాలరు. ఫ్రెంచి, ఇంగ్లీషు సైన్యాల సంఖ్య కంటె మూడంతలు ఎక్కువగా వుంటేనే దానిని దాటగల్గుతారు. జర్మనీకి అంత సైనిక బలం లేదు. కాబట్టి, మాజినాటే దుర్గశ్రేణి కిరుప్రక్కల యుద్ధం దీర్ఘకాలం సాగి, అందరూ అలసిపోతారు. ఈ లోపల బ్రిటిష్ సామ్రాజ్య రాజకీయ వేత్తల ఎత్తులలో హిట్లరు ఒకటి రెండు సంవత్సరాలలో నాశనం కాక తప్పదు" తన కుమారుడు సైన్యంలో మేజరు; ఆయన వద్దనున్న పుస్తకాలను తాను చదివి తెలుసుకొంటూనే ఉన్నారట!

"అయితే, మాక్సు వెర్నరుగారి పుస్తకాలను చదివారా?" అని అడిగాము. "లే" దన్నారు. మద్రాసు శాసన సభ లైబ్రరీలో ఉన్నాయనీ, చదవండనీ సలహా యిచ్చాము. ఫాసిస్టు రాజకీయాలను గురించి కూడా చదవమని చెప్పాము. అంతర్జాతీయ రాజకీయాలలో ఇంత అయోమయంలోవున్న డాక్టరు సుబ్బారాయనుగారిని గురించి శ్రీ సి. రాజగోపాలాచారి గారు తమ కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా యిచ్చేటప్పుడు చట్టసభలో యిలాగన్నారు: "అంతర్జాతీయ రాజయాలలో డాక్టరుగారు గొప్ప విద్యా

పారంగతుడు. అలాంటి విషయాల్లో నేను ఆయనపైనే ఆధారపడతాను. కాబట్టి, ఆ విషయాలను గురించి సుబ్బారాయను గారు మాట్లాడు తారు." అది విని కాంగ్రెసు శాసన సభ్యులు ఎంతగానో చప్పట్లు కొట్టారు.

## కాళేశ్వరరావుగారి కలలు

కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా యిచ్చుటకు కొద్దిరోజులు ముందుగా అప్పుడు చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా వున్న మిత్రులు శ్రీ కాళేశ్వరరావు పంతులుగారిని కలుసు కున్నాను. అసెంబ్లీ గ్రంథాలయంలో ఒక పుస్తకం కావలసి వెళ్ళాను. ఒక గంట ముందుగా వెళ్ళి నందున పంతులుగారి గదిలోకి వెళ్ళి కబుర్లు చెప్పుకున్నాము–

నేను : పంతులుగారూ! పుస్తకాలను కట్టలు కట్టిస్తున్నారే! కాంగ్రెసు మంత్రులు రాజీనామా ఇవ్వాల్సివస్తుందా?

ఆయన : "ఎందుకైనా మంచిది! గవర్నమెంటు రిపోర్టులువగైరా ఇక్కడ వుంటే, అరెస్టు కావడం సంభవించితే తిరిగి తీసుకు వెళ్ళడం కష్టం. అందువల్ల రోజూ కొద్ది కొద్దిగా తీసుకువెళ్ళు తున్నాను.

నేను : అయితే జైలుకు వెళ్ళాల్సి వస్తుందా?

ఆయన : కావచ్చు. మనకు స్వరాజ్యం యివ్వక తప్పదు. కాంగ్రెసు మంత్రుల సహాయంలేనిదే ప్రభుత్వం నడవదు. ఆ విషయాన్ని బ్రిటిషు ప్రభుత్వం గ్రహించ లేక మమ్మల్ని అరెస్టు చేస్తే, జైళ్ళలో మాత్రం పెట్టజాలరు. పోలీసులు ఎలా అరెస్టు చేయగలరు చెప్పండి? మాజిస్ట్రేటులు మమ్ములను శిక్షించుటకు సాహసించగలరా? మమ్ములనే అరెస్టు చేస్తే, అడయారు దగ్గర పెద్ద బంగళాలలో వుంచి, ఎంతో మర్యాదగా చూడక తప్పదు. అలా అరెస్టు చెయ్యడం కూడా ఒక విధంగా మంచిదే! ఒక్క వారం రోజుల్లో గవర్నమెంటు రాజీకి రాక తప్పదు. నాయకులను అరెస్టు చేసినందున మన కింకా ఎక్కువ అధికారాలు యివ్వక తప్పదు.

అని అప్పటి రాజకీయ పరిస్థితులను గురించి చెప్పారు. ఏమి కలలు; శ్రీ కాళేశ్వరరావు పంతులుగారివంటి నాయకులు యిలా భావిస్తున్నప్పుడు ఇతర కాంగ్రెస్ వారిని గురించి చెప్పనక్కర లేదు.

కాంగ్రెసు మంత్రివర్గం "అధికారంలో" ఉండగా కామ్రేడ్ బి. శ్రీనివాసరావుగారు బ్రిటిషు గవర్నమెంటుమీద తిరుగుబాటు చేయమని, స్వరాజ్యం గుంజుకోమని ఉపన్యసించారు. నేనా సభకు అధ్యక్షత వహించాను. ఆయనకు శిక్ష విధించారు. కొన్ని నెలల్లోనే ఆయన్ను శిక్షించిన మంత్రివర్గం వారుకూడా ఆయనతోపాటు జైల్లో వున్నారు.

చావుకు తెగించి పోరాడే రాజకీయ పార్టీ ఇండియాలోలేదు. అందువల్లనే మనం బానిసలుగా ఉంటున్నాము; అనుకొనేవాణ్ణి నేను.

(ఇంకా ఉంది)

## ఉచిత వివాహ శీర్షిక చదివాను ఆనందం పంచుకొంటున్నాను

ఆర్యా!

మన వైశ్య ప్రబోధిని గత నవంబరు సంచికలో ప్రచురితమైన విశాఖ పట్నం వైశ్య సోదరుల ఉచిత వివాహ శీర్షిక చదివి, వారితో, మీతో కలసి ఆనందం పంచుకొంటున్నాను. ఇలాంటి కార్యక్రమాలు ప్రతి జిల్లా కేంద్రములోనూ చేపట్టడం అవసరం. పేదతనములో ఉండి ఒక ఇంటి వారైన దంపతులకు యిటువంటి సంక్షేమ కార్యక్రమాలు కొంత ఊరటను కల్గిస్తాయి. ఇటు వంటి మంచి విషయాలు ప్రచురించి, అందరూ తెలిసి కొనుటకు అవకాశం కల్పించిన మీకు ధన్యవాదాలు. ఇటువంటి ప్రగతి శీలక కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యత ఇకముందు కూడా ఇవ్వండి.

వక్కలగడ్డ సూర్య ప్రకాశరావు
నర్సారావు పేట

## చాలా బాగున్నవి

ఆర్యా!

వైశ్య ప్రబోధినిలో ముద్రితమగుచున్న వాస్తు విద్యాప్రవీణ శ్రీమతి బి.లక్ష్మీ కాంతమ్మ గారి వాస్తు శాస్త్ర విషయాలు చాలా బాగున్నవి వారి విలాసము తెలపండి.

వై.తాండవ కృష్ణ
గుంటూరు.
తేది : 27.12.94

## రేడియోలో వినలేని కొరత తీర్చింది

ఆర్యా!

వైశ్య ప్రబోధిని సక్రమంగా అందుచూ ఉంది. నవయుగ కవి చక్రవర్తి అను మీ ఆకాశవాణి ప్రసంగం చాలా బాగుంది. రేడియోలో వినుటకు లేని కొఱత తీర్చింది. "నేను - నాదేశం - దర్శి చెంచయ్య గుప్త" అని వ్రాస్తే బాగుంటుందేమో ఆలోచించండి.

ఇదే సంచికలోని పౌరాణికమా? చారిత్రకమా? అను వ్యాసం కూడా బాగుంది. సరళమైన భాషలో పత్రికను మంచి స్థాయికి తెస్తున్నారు. సంతోషము.

యం.సి.వెంకటరెడ్డి
రామేశ్వరం - ప్రొద్దుటూరు.

## యం.వి. సుబ్రమణ్యం గారి మరణం

కర్నూలు జిల్లా ద్రోణాచలం వైశ్య ప్రముఖులు శ్రీ యం.వి. సుబ్రమణ్యం గారు 7.12.1994వ తేదీన స్వర్గస్తు లయ్యారు. వీరికి ముగ్గురు కుమారులు.

## గ్రంధి సోమరాజు గారి మరణం

విశాఖ పట్నం వైశ్య ప్రముఖులు శ్రీ గ్రంధి సోమరాజు గారు 26.12.1994వ తేదీన స్వర్గస్తులయ్యారు.

# వాస్తు శాస్త్రము

గృహ నిర్మాణ విషయంలో వాస్తు శాస్త్రం అనాదిగా మన దేశంలో ఎంతో ప్రాధాన్యం సంతరించుకుంది. 'వాస్తు' కేవలం గృహ సౌకర్య సౌలభ్యాలను నిర్దేశించే శాస్త్రంగా కాక, గృహస్థు జీవన స్థితిగతులను నిర్ణయించే శాస్త్రంగా మనవాళ్లు అంగీకరిస్తున్నారు. అయితే, వాస్తు ఒక ప్రత్యేక శాస్త్రం కాదని, వాస్తు - హస్త సాముద్రికం జ్యోతిషం అన్నీ ఒకే శాస్త్రం కిందికి వస్తాయనీ చెప్తున్నారు, కడప జిల్లా ప్రొద్దుటూరుకు చెందిన శ్రీమతి బి. లక్ష్మీ కాంతమ్మ గారు. ప్రపంచంలోనే అరుదైన హస్త వాస్తు జ్యోతిష ప్రక్రియను సమర్థంగా నిర్వహిస్తూ సాముద్రిక విద్యాప్రవీణ, వాస్తు విశారద బిరుదాలను ఆమె అందుకున్నారు. ఆసక్తిదాయకమైన ఈ శాస్త్రం గురించిన సందేహాలకు శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారిచ్చిన సమాధానాలను ఇక్కడ ప్రచురిస్తున్నాము – ఎడిటర్.

**1. ప్రశ్న: వాస్తు శాస్త్రం కని పెట్టిన వారెవరు?**

★ బ్రహ్మదేవుని ఆశీస్సులతో గర్గ మహాముని కనిపెట్టినాడని ప్రాచీన వాస్తు గ్రంథకర్తలు వ్రాశారు. గర్గమతాన్ని అనుసరించి విశ్వకర్మ వ్రాశాడని, తన్మూలంగా మానసార, సమరాంగణ సూత్రధారాది గ్రంథాలు వెలువడ్డాయని చెపుతారు. వీరందరు గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలు.

**2. ప్రశ్న: వాస్తు వేరు, జ్యోతిషం వేరు కదా?**

★ కాదు. రెండూ ఒకటే. ఒక్కొక్క దిశకు ఒక్కొక్క గ్రహం ఆధిపత్యం వహిస్తుంది. ఆ గ్రహకారకత్వం చూచి ఫలితం చెపుతాము..ఉదాహరణకు తూర్పు దిశకు రవి అధిపతి. రవి పితృకారకుడు. కనుక తూర్పును బట్టి పితృభావం వివరిస్తాము. అలాగే ఈశాన్యానికి గురువు అధిపతి. గురువు పుత్రకారకుడు. కనుక ఈశాన్య దిశను బట్టి పుత్రభావం వివరిస్తాము. వాస్తు శాస్త్రమంతా నవగ్రహాత్మకమే. సందేహమక్కరలేదు.

**3. ప్రశ్న: నవీన వాస్తు పరిశోధకులు ఈశాన్య దిశ ఎంత పెంచితే అంత మంచిదంటున్నారు. మీరేమంటారు?**

★ అది తప్పు అంటాను. వృథాగా ఆ దిశను ఖాళీగా వదిలివేయడంజాతీయ నష్టమని కూడా అంటాను. అసలు ఈశాన్యం పెంచవలెనని ఏ శాస్త్రమూ చెప్పలేదు. అలా పెంచితే నూటికి తొంబయిమంది దెబ్బతింటారు. పదిమందికి కలిసి రావచ్చు. అంతే, పరీక్షించి చూస్తే తెలుస్తుంది.

**4. ప్రశ్న: మరి ఈశాన్య ప్రాధాన్యం ఎలా అమలులోకి వచ్చింది?**

★ 1954 సం॥లో కే.శే. ముద్రగడ

రామారావుగారొక పుస్తకం ప్రకటించారు. వారు ఆసేతు శీతాచలం పర్యటించి, ఈశాన్యం పెరిగిన భవనాలు, పుణ్య క్షేత్రాలు, తీర్థాలు అభివృద్ధి పొందినవని కొన్నింటిని తార్కాణిస్తూ పుస్తకం వ్రాశారు. అది ప్రత్యక్ష సాక్షి కథనంగా విశ్వసించి, నవీన వాస్తు పరిశోధకులందరూ అదే పాట పాడుతున్నారు. పరిశోధిస్తే వాస్తవం తెలుస్తుంది.

**5. ప్రశ్నః మీ శాస్త్రం మూల సిద్ధాంతమేమిటి?**

★ అందరికీ ఒకే వాస్తు పద్ధతి సరి పడదు. జాతకానుగుణంగా వాస్తు చెప్పాలి.

**6. ప్రశ్నః జాతకం లేకుంటే?**

★ జాతక చక్రం హస్తంలోనే వుంటుంది. చేతిలోని గీతలు బ్రహ్మలిపి అంటారు. ఆ లిపి చదవడానికి జ్యోతిష పరిజ్ఞానం కావాలి. హస్తపద్మంలో ద్వాదశ రాసులు, నవగ్రహాలు, ఉచ్చనీచభేదాలు, మహాదశలు, అంతర్దశలు అన్నీ తెలుసు కోవచ్చు. ఇంతెందుకు? హస్తంచూచి, గ్రహాలను గుర్తించి, లగ్నం నిశ్చయించి, జాతక కుండలి వేయవచ్చు. పాత పంచాంగం అక్కరలేదు.

**7. ప్రశ్నః బావి ఏ దిశలో త్రవ్వించు కోవాలి?**

★ ఫలానా దిశలోనే బావి త్రవ్వించు కోవాలి అని నిర్దేశించడం తప్పు. ఏ దిశలో జలసమృద్ధి ఉంటే ఆ దిశలో బావి త్రవ్వించుకోవాలి. ఒక దిశలో రాతిచట్టు వుంటుంది. నీరు పడదు. వాస్తు పండితునికి భూగర్భ వాస్తు పరిజ్ఞానం వుండాలి. భూమిలో ఎటువంటి శిలవుంది? ఎటు వంటి మట్టి వుంది? లేదా, సుద్దవుంది? జలనాడులు ఏయే దిశలో ఎంత లోతులో? ఎంత ప్రమాణంలో? ఎన్ని వున్నవి? నీటి రుచి, రంగు తెలుసుకోవాలి. శ్రీ శేషమఠం వేదాంతాచార్యులు గారు- (తెలుగు లెక్చరర్, నల్లకుంట, హైదరాబాద్) ఈశాన్యంలో బోర్ వేయించారు. కొద్దిగా నీళ్లు వచ్చినవి. క్రమంగా ఆరిపోయినవి. ఆగ్నేయానికి మార్చుకోక తప్పలేదు. ఇప్పుడు జలధార సమృద్ధిగా వుంది. అంతా క్షేమంగా ఉన్నారు. తార్కాణాలు శతాధికంగా వున్నవి. అందరికీ ఒకే దిశలో నీళ్లుండవు.

**8. ప్రశ్నః తండ్రి జాతకానుగుణంగా గృహనిర్మాణంచేస్తే అది పుత్రునికి పనికి వస్తుందా?**

★ పుత్రుడు సమానజాతక లక్షణాలు కలవాడైతే, తండ్రి కట్టిన యిల్లు పనికి వస్తుంది. లేకుంటే, కొన్ని మార్పులు చేర్పులు చేసుకొంటాడు లేదా, విక్రయిస్తాడు. లేదా ఖాళీ చేసి వెళ్లి క్రొత్త యిల్లు నిర్మించుకొంటాడు.

**9. ప్రశ్నః భూతగృహాలు (HAUNTED HOUSES) గురించి మీ అభిప్రాయమేమిటి?**

★ లండన్ వంటి మహానగరంలో కూడా, చరిత్ర ప్రసిద్ధ భూతగృహా లున్నాయి. అన్నిదేశాలలో అన్ని చోట్లా

వున్నవి. లోకంలో తొమ్మిది వందల తొంబయి తొమ్మిది మందికి ఒక భూత గృహం మహాభయంకరమైతే, ఒకానొక వ్యక్తికి ఆనందనిలయమవుతుంది. ఆ వ్యక్తి ఆ చోట అడుగు మోపితే పిశాచనిలయం దేవతానిలయమవుతుంది. ఈ రహస్యం గుర్తించగలవారే వాస్తు వేత్తలు. విషాన్ని అమృతంగా మార్చే విధానంలో కృతహస్తులు కావాలి. ఈ పరీక్షతో అందరికి ఒకే వాస్తు పద్ధతి అనేవాదం పరాస్తమై పోతుంది.

**10. ప్రశ్న: నిధి నిక్షేపాలు అంజనం వేసి చూసి చెపుతారా? సాధిస్తారా?**

★ అంజనం అక్కరలేదు. హస్త కుండలి చూచి చెపుతాను. నిధినిక్షేపించిన వారెవరు? అది వెండియా? బంగారమా? రత్నాలా? దానికి రక్షగా సర్పమో పిశాచమో వుందా? కదిలిస్తే అపాయమా? అది యెవరికి? ఎపుడు కలిసివచ్చే యోగ ముంది? ఇంకా చాలా విశేషాలు చెప్పవచ్చు.

**11. ప్రశ్న: ఖాయిలా పడ్డ పరిశ్రమల గురించి తరణోపాయం చెపుతారా?**

★ స్థలం చూడాలి. ఆ పరిశ్రమకు ఆధిపత్యం వహించే ప్రధాన వ్యక్తి హస్తకుండలి చూడాలి. కేవలం వాస్తు సవరిస్తే చాలదు. అధిపతి యోగం కూడా చూడాలి. స్థూలంగా పరిశ్రమ భవనాలు, ద్వారాలు, ప్రాకారం చూచి, దాని జాతకం చెప్పవచ్చు. జరిగినది, జరుగుచున్నది, జరగబోయేది కూడా చెప్పవచ్చు.

**12. ప్రశ్న: ఒక స్థలం చూచి అక్కడ ఎప్పుడు? ఏ ఆకృతిలో, ఎటువంటి భవనం నిర్మితమవుతుందో చెప్పగలరా?**

★ అలా చెప్పకపోతే "వాస్తువిద్యా ప్రవీణ" అంటారా? ఇంకో ముఖ్యవిషయం గమనించాలి. మానవులకు వలెనే గృహానికి ఆయుర్దాయముంటుంది. రోగాలు, ఔషధాలు వున్నట్లు, శిథిలత్వాలు, రిపేరులు ఉంటాయి. ఆ విషయాలు వాస్తువేత్తలు మాత్రమే గుర్తింపగలరు. ఒక యిల్లు ఒక వంశవృక్షం చేతిలో ఎన్ని తరాలు నిలుస్తుంది? ఎపుడు పరాక్రాంతమవు తుంది? ఎపుడు రూపుమారుతుంది చెప్పవచ్చు.

**13. ప్రశ్న: మీ శాస్త్రసారాంశమేమిటి?**

★ అన్ని దిశలు మంచివే.. అన్ని సింహద్వారాలు మంచివే. మిట్టపల్లాలు, వీధి పోటులూ, విధినిషేధాలు లేవు. ఎవరికి తగినది వారు ఎన్నుకొంటే అదే శ్రేయస్కరమవుతుంది.

**14. ప్రశ్న: ఇల్లు కావాలను కొనేవారికి మీరిచ్చే సలహా?**

★ కొందరికి గృహ నిర్మాణ యోగ రేఖ వుంటుంది. కొందరికి వుండదు. యోగరేఖ వున్నవారు గృహనిర్మాణం ఆరంభిస్తే చకచక సాగుతుంది. లేని వారికి అడుగడుగునా, అన్నీ ఆటంకాలే, యోగరేఖలేని వ్యక్తులు రెడిమేడ్ గృహం కొంటే కష్టనష్టాలుండవు. సుఖపడతారు..

**15. ప్రశ్న: సర్పానికీ, వాస్తుశాస్త్రానికి సంబంధముందా?**

★ సర్పాలు, వైష్ణవసర్పం, శైవసర్పం అని రెండు రకాలు. స్థితికర్త విష్ణువు

సర్పశయనుడు. లయకర్త శివుడు సర్పభూషణుడు. వైష్ణవసర్పం పడగ లోతట్టున [illegible] గుర్తుంటుంది. శైవ సర్పం. అయితే మూడు విభూతి పట్టెలుంటాయి. ఏ వ్యక్తియింటిలో ఏజాతి సర్పముందో వాస్తు వేత్తకు తెలుస్తుంది. అందరి యిండ్లలో వుండదు. కొందరు చంపివేస్తారు. చంపితే తిరిగి ఆరు మాసాలలోగా అదే జాతి సర్పం చేరుకొంటుంది. వజ్రకరూరు నుండి ఒక వ్యక్తి వచ్చాడు. బావి త్రవ్వించుకొనుటకు యోగ్యమైన స్థలం అడిగాడు. అతని హస్తం చూచి ఆశ్చర్యపడ్డాను. పదిరోజుల క్రితం మీ దొడ్డిలో త్రాచుపాము పడగెత్తి దర్శనమిచ్చింది. ఆ స్థలం గుర్తుందా? అన్నాను. అతనికి ఆశ్చర్యం కలిగింది. పో! అదే స్థలంలో బావి త్రవ్వించు. మంచి నీళ్లు పడతాయి అన్నాను. ఒకొక్క చోట సర్పం పడగెత్తి ఆడితే ఆచోట మహాహర్మ్యం వెలసి కనువిందు చేస్తుంది. సర్పానికి వాస్తుశాస్త్రానికి చాలా సంబంధముంది.

'వాస్తు, సాముద్రిక విద్యాప్రవీణ' శ్రీమతి బి.లక్ష్మీకాంతమ్మ గారితో ఇంటర్‌వ్యూ - అను శీర్షికన ఉదయం దినపత్రిక 6-3-1994 ఆదివారం సౌజన్యంతో.



# పుత్ర స్థాన ప్రాధాన్యత



రచన : సత్రసాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

"అపుత్రస్య గతిర్నాస్తి" అని సంతాన విషయమై యజ్ఞ, యాగాది క్రతువులు అనేకం సంతానం లేని దంపతులు చేస్తూ వుంటారు. అట్టి ఈ విషయ సేకరణ జ్యోతిశ్శాస్త్రమునందు ముఖ్య పీఠికను అధిష్టించియున్నది. ఈ సంతాన స్థానమును పంచమ స్థానమని అంటారు. ఇది లగ్నమునకు ఐదవది.

ఈ భావమునుండి మనము సంతాన విషయమే కాక, దైవభక్తి, మంత్రోపాసన, గ్రంథరచన, వేదాంత శాస్త్ర పరిజ్ఞాన విషయము కూడా కనుగొనవచ్చును. సంతాన భావ చర్చకు ముందు మనము కనుగొన వలసిన విషయము పంచమ భావమును. పంచమమునకు పంచమము. అనగా నవమ భావమున ద్వితీయమగు కుటుంబ స్థానము, లగ్నమును శోధించుట అతి ముఖ్యము. ఇదిగాక పుత్రకారకుడగు గురువి, నైసర్గిక పాపులగు రవి, రాహువులను కూడా సంతానకారకులనుట శాస్త్రసమ్మత మగుటచే వారిని, ఉపపదమునకు పంచమ, నవములందున్న గ్రహములను ఉప పద మనగా వ్యయాధిపతి వ్యయమునకు ఎన్నవ ఇంటిలో వుండునో వానికి అన్నవ యిల్లు ఉపపదమని గ్రహింపుము. శుభ గ్రహములగు బుధ, శుక్రులు సహా సంతాన విషయమై యోచన చేయుట అతి ముఖ్యము.

శాస్త్రవేత్తలు సంతాన విషయమై గ్రహములను 3 రకములుగా విభజించినారు. అవి ఏమనగా 1.బహుపుత్ర గ్రహములు, రవి, గురు, రాహువులు. 2. ఏకపుత్ర గ్రహము : చంద్రుడు. 3. అనపత్య గ్రహములు అనగా గొడ్డు గ్రహములు : శుక్ర, శని, బుధ, కుజులు. కాన వీటిని దత్త గ్రహములని అందురు.

జాతకునకు జన్మలగ్నమునుండి కాని, ఉపపదమునుండి కాని పంచమ నవము లందు రవి, గురు, రాహువులు కాని, రవి, గురువులు కాని, రవి, రాహువులుకాని, గురు, రాహువులుకానీ, వీరిలో ఏ ఒక్కరు కాని వున్న యెడల బహుపుత్ర యోగ మున్నదని గ్రహించుము.

కళత్రభావ విషయమును చర్చించుట సంతాన విషయమునకు అతిముఖ్య మైనది. పుత్రభావముకాని, పుత్ర భావాధిపతులు తత్ కారకులు శుభయుతులై నను, వీక్షితులైనను వున్న జాతకునకు పుత్రసంతాన వృద్ధియుండును. గురుడు పుత్ర స్థానమందున్నను లాభాధిపతిచే చూడబడినను, లాభాధిపతి పుత్రస్థాన మందున్నను, గురుడు ధన, లాభములలో ఎక్కడ వున్నను, బహుపుత్ర యోగము సంభవమగును. గురుడు లాభస్థానమున

ఉన్నప్పటికి 1, 5, 9 అధిపతులు 6, 8, 12ట వున్నప్పుడు కాని, రవి, చంద్ర, రాహువులు 5, 9, 11 ట ఎక్కడనైనా వున్న యెడల పురుష సంతతికి ఆస్కారముండదని శాస్త్ర నిర్దేశితము.

లగ్న పంచమాధిపతులు మిత్రులైన జాతకుని పుత్రుడు జాతకునకు స్నేహ, ప్రేమపాత్రులుగను, తత్ లగ్న పంచమాధిపతులు శత్రువులైన జాతకునకు విరోధులై ప్రవర్తించెదరు. ముఖ్యముగ లగ్న పంచమాధిపతులు పరివర్తనగతులైనను ఒకరినొకరు వీక్షితులైన యెడల జాతకుని పుత్రుడు తండ్రికి విధేయులై భక్తి, ప్రేమలతో మసలెదరు.

వ్యయ స్థానమున కుజుడు, అష్టమమున గురువు, లగ్నమున శని, వుండి తత్ గ్రహములు శుభ గ్రహములతో కలసి కాని, చూడబడినను, చాలా కాలమునకు పుత్ర సంతతి కలుగును. పుత్ర స్థానములగు పంచమ, సప్తములందు చంద్రుడు వున్న యెడల ఒక పుత్రుడు వుండునని ఇది ఉపపదమునకు 5, 9ట చంద్రుడు వున్నపుడు సంభవమగుట జరుగుచుండును. మకర లగ్నమునకు ఐదింట శని, కుజులు వున్న దత్త పుత్ర యోగము కలుగును. లగ్నాధిపతి, సప్తమాధిపతి, గురువు ఈ ముగ్గురును బలహీనముగా వున్న సంతానయోగముండదని శాస్త్ర నిర్దేశితము.

పుత్రభావమునందు పాప గ్రహముండి, తత్ భావమును, పాప గ్రహములు చూచిన జాతకునకు సంతానయోగముండదు. పుత్రభావాధిపతి నీచయందున్నను పాప గ్రహములచే చూడబడినను, జాతకునకు సంతాన నష్టము కలుగును. పుత్రభావాధిపతి 6, 8, 12ట వుండి పాప గ్రహములచే చూడబడిన సంతాన నష్టము జరుగును.

పుత్ర కారకుడగు గురువు బలయుతుడుగా వుండి శుభ గ్రహ వీక్షితుడైన తప్పక పుత్రుడు కలుగును. లగ్నాధిపతి ద్వితీయ, తృతీయ భావమునందున్న ముందుగా పుత్ర సంతానము కలుగును. లగ్నాధిపతి పంచమ భావమునందున్న ముందుగా పుత్ర సంతానము, తరువాత స్త్రీ సంతానము వరుసగా కలుగుదురు. ద్వితీయాధిపతి పంచమ స్థానమున గురునితో చేరి శుభ గ్రహ వీక్షితుడై వున్న మంచి సంతానము కలుగును. లగ్నాత్తు గాని, చంద్ర లగ్నాత్తు కాని, గురుని లగాయితు కాని, పుత్ర భావమేది యగునో ఆ భావాధిపతి యొక్క దశయందు పుత్ర సంతానము తప్పక కలుగును.

తృతీయాధిపతి తృతీయమందుకాని, 1, 2, 12, 5 స్థానములయందున్న యెడల పుత్ర సంతతి కలిగి నష్టమగునని శాస్త్ర నిర్దేశితము. పంచమ భావమునందు కుజుడు వున్న యెడల విశేషముగా సంతాన నష్టము కలుగును. గురుని లగాయితు పుత్ర భావాధిపతి బలహీనముగా వుండి, పాప గ్రహములతో కలసినను, షష్ఠాధిపతి ఎనిమిదింట వున్నను అట్టి వానికి పుత్ర సంతానముండుటకు

ఆస్పదము చాలా తక్కువ. మకరమందు కాని, కుటుంబ స్థానమందుకాని కుజుడు వున్న పుత్ర సంతానము వుండదు. కర్కాటకమునందు కుజుడు వున్న స్వల్ప పుత్ర సంతానముండును. స్త్రీ రాశుల యందు కుజుడు వున్న స్త్రీ సంతతి మాత్రమే వుండును.కుజుడు తొమ్మిదింట కాని, మిధునమందుకాని వున్న అల్ప పుత్ర సంతానము కలుగును.

పంచమమందు రవి వున్న స్వల్ప సంతానవంతుడు, కష్టార్జితమువల్ల ద్రవ్యము సంపాదించువాడు, సామాన్య ధనవంతుడు, మేధావిగా వుండును. పంచమ మందు చంద్రుడు వున్న జాతకుడు విశేష ధన వంతుడు, పుత్ర సంతానము కలవాడు పాపుడయిన చంద్రుడు ఐదింట వున్న స్వల్ప భోగి, సంతాన సౌఖ్యము లేనివాడిగను, శుభ, చంద్రులున్న స్త్రీసంతాన వృద్ధికుటుంబ సౌఖ్యము వుండును. లగ్నము లగాయితు కాని, గురుని లగాయితుకాని, చంద్ర లగాయితుకాని, పంచమమందు కుజుడు వున్న సంతాన నష్టము తత్ కుజుడు ఉచ్ఛయందున్న ఏక పుత్ర జనితుడు అయి వుండగలడు.

పుత్ర భావమందు బుధుడు వున్న సంతాన సౌఖ్యము, భాగ్యవంతుడుగ, గురు భక్తి కలిగి కవియై విలసిల్ల గలడు. స్త్రీ సంతానము అధికముగ వుండి సౌఖ్యమును అనుభవించును.

పుత్రభావమునందు గురువు వున్న యోగ్యమగు కళత్రముతో అధిక పుత్ర సంతతి కలిగి ఆ పుత్రుల వల్ల యశస్సు, కీర్తి కలిగి సర్వ జన రంజకుడై వాసికెక్క గలడు. పంచమమందు శుక్రుడు వున్న విశేష ధనవంతుడై, స్త్రీ సంతాన వృద్ధి కలిగి, బంధువులచేతను, పుత్రులచేతను సర్వదా పూజింపబడును. శని శత్రు క్షేత్రమందుకాని, నీచయందుకాని, ఐదింట కాని, శుభగ్రహ దృష్టిలేక వున్న ధనహీనుడు, పుత్రహీనుడుగా వుండును. ఆ శని ఉచ్ఛ, స్వక్షేత్ర, మిత్రక్షేత్రగతుడై పంచమ స్థానమందున్న పుత్రసంతానము కలిగి భోగియై విలసిల్లగలడు.

రాహువు పంచమమందు రవి చంద్ర క్షేత్రములయందు వుండెనేని పుత్రులు లేనివాడు, దేశాటన చేయువాడు, స్త్రీ సంతాని, సౌఖ్యహీనుడుగా వుండుటకు హాస్పదము గలదు. కేతువు పంచమ మందుండెనేని అల్పసంతాని, తండ్రితో సఖ్యత లేనివాడు, మంచి గణిత శాస్త్రజ్ఞుడుగా బాగుగా వ్రాయు నేర్పు గలిగి వుండును.

పంచమాధిపతి పంచమందున్న పుత్రులు జీవించియుండుట సంశయా స్పదము. ధార్మికుడుగ, బుద్ధిమంతుడుగ, చంచల స్వభావిగా వుండగలడు. పంచమాధిపతి షష్టస్థానమున వున్న కాని, వ్యయమందు కాని వున్న పుత్రుడు ధన వంతుడై రూపసిగా వుండగలడు. పుత్రు నితో శత్రుత్వము సహా కలిగి వుండును. పంచమాధిపతి సప్తమమందున్న యెడల సర్వ స్వతంత్రుడు, ధర్మ గుణుడు, భక్తి

కలవాడుగా వుండగలడు. పంచమాధిపతి అష్టమమందుకాని ద్వితీయమందుకాని వున్న అనేకమంది పుత్రికలు కలిగి సౌఖ్యము లేక ధనవంతుడై మనగలడు.

పంచమాధిపతి సప్తమమందుకానీ, దశమమందుకాని యున్న రాజతుల్యుడగు కుమారుని కలిగి యశోవంతుడై రాజిల్ల గలడు. పైపెచ్చు గ్రంథకర్తగా కాని, వంశమును వుద్ధరించు మహానుభావునిగా గానీ వుండగలడు. పంచమాధిపతి లాభ స్థానమందున్న అనేక మంది పుత్రులు కలిగి కవి పండితుడై ధనవంతుడై వినుతి కెక్కగలడు. పంచమాధిపతి లగ్న, తృతీయములందు వున్న యెడల లోభిగా, మాయావిగా, రూపాయలను పాపాయిలుగా జూచు పిసినారిగా వుండగలడు.

పంచమాధిపతి చతుర్థమందున్న చిర కాలము మాతృ సౌఖ్యము కలిగి గుణ వంతుడై సమర్థుడగు గురువుగా ధన సంపత్తులు కలిగి వాసికెక్క గలడు. సహజముగ చాలా మందికి తమ యొక్క సంతాన సంఖ్య విషయములను తెలుసు కొనవలయునని అభిలాష వుండుట సహజము. ఈ క్రిందివాటిని గ్రహించిన విషయము విశదము కాగలదు.

పుత్రస్థానమునకుగాని, పుత్రస్థానాధి పతికి గాని, కుటుంబ స్థానమునకు గాని, కుటుంబ స్థానాధిపతికి గాని గురుని యొక్క సంబంధ వీక్షణలున్న, రెండు, ఐదు, స్థానములకు గురువు బలయుతుడై, అధిపతియై వున్న 5 మొదలు 9 వరకు సంతానము కలుగును.

పై స్థానములకు శుక్రుని యొక్క వీక్షణ యున్న 6 వరకు సంతానము కుజునియొక్క వీక్షణ సంబంధములున్న ముగ్గురు సంతానము పూర్ణ చంద్రుని సంబంధమున్న ఇద్దరు సంతానము, బుధుని యొక్క సంబంధమున్న దత్త పుత్ర యోగము, శని సంబంధవీక్షణమున్న సంతాన నష్టము కలిగి చివరన అల్ప పుత్రికా సంబంధము కలుగును.

రవి సంబంధ వీక్షణవల్ల పుత్రుడు ఒక్కడే కలుగుటయు, రాహు కేతు సంబంధ వీక్షణ వల్ల స్త్రీ సంతతి ఎక్కువ కలిగి చాలా భాగము నష్టమగుట సహా సంభవించును. సంపూర్ణ పాపులయిన కుజ, శని, రాహువుల సంబంధ వీక్షణ వల్ల విశేష నష్టము, గర్భస్రావములు జరుగుటకు ఆస్పదమున్నది.

ముఖ్యముగా పంచమ, నవమ, ద్వితీయ భావములను వాటిని చూచు గ్రహములను, వాటితో చేరిన శుభ పాప గ్రహములను, సంతాన కార గ్రహములను, వాటి స్థాన విషయములను చక్కగా ఆకళించుకొని ఫలనిర్దేశన చేసిన ఉత్తమ ఫలితములను సాధించవచ్చును. తత్ విషయ పరిశోధన యందు జ్యోతిశ్శాస్త్ర మహారథులు, కాళిదాసు, జైమిని మున్నగు మహానుభావులను తమ దయార్ద్ర చూపులను మీపై ప్రసరింప జేయమని ప్రార్థిస్తాము.

## దుకాణాలు - సంస్థలలోని ఉద్యోగుల సెలవు దినాలు

| | | |
|---|---|---|
| 26-01-1995 | గురువారము | రిపబ్లిక్ డే |
| 03-03-1995 | శుక్రవారము | రంజాన్ |
| 01-04-1995 | శనివారము | ఉగాది |
| 01-05-1995 | సోమవారము | మే డే |
| 15-08-1995 | మంగళవారము | భారత స్వాతంత్ర్య దినము |
| 02-10-1995 | సోమవారము | గాంధీ జయంతి |
| 03-10-1995 | మంగళవారము | విజయదశమి |
| 01-11-1995 | బుధవారము | ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ దినము |
| 25-12-1995 | సోమవారము | క్రిస్టమస్ |

– Progs. No. డి2/ఎ.పి.యస్.యఫ్. అండ్ ఒ.హెచ్./94 తేది : 6.12.1994, డిప్యూటి కమీషనర్ ఆఫ్ లేబర్, కర్నూలు.

## కర్మాగారాలు - సంస్థలలోని ఉద్యోగుల సెలవు దినాలు

| | | |
|---|---|---|
| 26-01-1995 | గురువారము | రిపబ్లిక్ డే |
| 03-03-1995 | శుక్రవారము | రంజాన్ |
| 01-04-1995 | శనివారము | ఉగాది |
| 01-05-1995 | సోమవారము | మే డే |
| 15-08-1995 | మంగళవారము | భారత స్వాతంత్ర్య దినము |
| 02-10-1995 | సోమవారము | గాంధీ జయంతి |
| 03-10-1995 | మంగళవారము | విజయదశమి |
| 25-12-1995 | సోమవారము | క్రిస్టమస్ |

– Progs. No. డి2/ఎ.పి.యస్.యఫ్. అండ్ ఒ.హెచ్./94 తేది : 6.12.1994, డిప్యూటి కమీషనర్ ఆఫ్ లేబర్, కర్నూలు.

